సంపాదకీయం....✍



# బిల్ క్లింటన్ పర్యటన



అమెరికా అధ్యక్షులు బిల్‌క్లింటన్ భారతదేశంలో ఐదురోజులపాటు తన పర్యటనను విజయవంతంగా ముగించుకొని వెళ్ళారు. ఢిల్లీ జైపూర్, ఆగ్రా, హైద్రాబాద్, ముంబాయిలలో ఆయనకు ఆదరంతో, అత్యంత ఆత్మీయభావంతో ఘనస్వాగతం లభించింది ఆగ్రాలోని తాజ్‌మహల్‌ను చూచి ముగ్ధుడై పులకరించిన క్లింటన్ "**నా చిరకాలవాంఛ నెరవేరింది. నాకు చెప్పలేనంత సంతోషంగా ఉంది**" అన్నారు. రాజస్థాన్‌లోని 'నైలా' అనే కుగ్రామమును సందర్శించినప్పుడు అక్కడి మహిళలు సాదరపూర్వకంగా, సంప్రదాయబద్ధంగా, జానపదజావళీలతో ఆయనను ఆహ్వానించినప్పుడు, తన్మయుడై, రచ్చబండమీద కూర్చొని, అక్కడి మహిళల స్వీయగాథలను శ్రద్ధగావిని, వారు ఏ విధంగా స్వయం కృషితో అభివృద్ధిని సాధించారో తెలిసికొని సంభ్రమాశ్చర్యములను ప్రకటించి, సంతోషంతో కరచాలనంచేశారు. పార్లమెంటు సెంట్రల్‌హాల్‌లో జరిగిన ఉభయసభలలో భారతప్రధాని శ్రీ వాజ్‌పేయి ప్రసంగిస్తూ వినిపించిన కవితలకు అమితానంద భరితుడై తాను కూర్చొనిన సీటునుంచి లేచి, వాజ్‌పేయి వద్దకు వచ్చి, అభినందన పూర్వకంగా కరచాలనం చేశారు క్లింటన్ స్లైడ్సును ప్రదర్శిస్తూ మన ముఖ్యమంత్రి శ్రీ నారాచంద్రబాబునాయుడు చేసిన ప్రసంగం తీరుకు, అటు పట్టణ ప్రాంతాలలోను, ఇటు గ్రామీణ మహిళాభ్యుదయంకు, ఐ.టి వినియోగం ద్వారా సాధించిన అభ్యుదయమును చూచిన క్లింటన్ శ్రీ చంద్రబాబుపై ప్రశంసల వర్షం కురిపించారు హైద్రాబాద్‌లోని మహావీర్ హాస్పిటల్ సేవలను స్వయంగా తిలకించి, మెచ్చుకొని, భారత్‌లో ప్రాణాంతకవ్యాధుల పై పోరుకు 50 లక్షల డాలర్ల భూరి విరాళం ప్రకటించారు. ఇంకా 400 కోట్ల డాలర్ల విలువైన వ్యాపార ఒప్పందాలు కూడా కుదరడానికి క్లింటన్ పర్యటన తోడ్పడింది ఇకపోతే పాకిస్థాన్ తీవ్రవాదులు కాశ్మీరులో సిక్కులపై జరిపిన మారణహోమాన్ని విని, చలించి, ఇస్లామాబాద్ వెళ్ళి పాక్‌ను తీవ్రంగా మందలించి, తాను ఢిల్లీలో యిచ్చిన మాటను నిలబెట్టుకొన్నాడు క్లింటన్. ఐ.టి. రంగంలో భారత్‌కు, ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌కు అన్ని విధముల సాయపడగలనని హామీ యిచ్చి వెళ్ళారు క్లింటన్.

"**కంప్యూటర్లు కూడు పెడతాయా?**" అని ఎకసెకాలాడిన నిత్యశంకితులకు, "**క్లింటన్ పర్యటనవలన ఖర్చేతప్ప, రాష్ట్రానికి ఒరిగేదేమిలేదు**". అని వాదించిన రాజకీయ నాయకులకు క్లింటన్ పర్యటన కనువిప్పు అవుతుందనటంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

ఇకపోతే కొన్ని వామ పక్షాలు క్లింటన్ పర్యటనను వ్యతిరేకిస్తూ నిరసన ప్రదర్శనలు జరిపారు, ఆయన బొమ్మలను తగులబెట్టారు. ఇది నిజంగా దురదృష్టకరం, భారతీయ సంప్రదాయానికి విరుద్ధం, సంస్కారానికి తీరని కళంకం. కేవలం అమెరికా విధానాలు నచ్చనంతమాత్రమున, భారత ప్రభుత్వ ఆహ్వానం పైవచ్చిన అతిథిని అగౌరవపరచటానికి ప్రయత్నించడం ఏ మాత్రం విజ్ఞత లక్షణం కాదు. ఈ చర్య భారతీయుల ప్రధాన లక్ష్యాలలో అతి ముఖ్యమైన '**అతిథిదేవభవ!**' సిద్ధాంతానికే పూర్తి విరుద్ధం. మరొక ముఖ్యవిషయం. కొన్ని లక్షలమంది భారతీయులు, అందులో ఎక్కువ మంది తెలుగువారు ఈనాడు అమెరికాలో ముఖ్యంగా కంప్యూటర్ రంగంలో అత్యంత గణనీయమైన పాత్రను పోషిస్తున్నారు, ప్రశంసలనందుకుంటున్నారు ఇటువంటి తరుణంలో, ఆ దేశఅధినేత మన దేశమునకు అతిథిగా వచ్చినప్పుడు ఆయనను అగౌరవపరచడానికి ప్రయత్నించుతే, అమెరికాలో నున్న భారతీయ సంతతి వారి మనోభావాలు ఎలా వుంటాయో వీరు ఆలోచించివుంటే ఈ స్థితికి దిగజారివుండేవారు కాదేమో! అందులో భారత సంతతికి చెందిన ప్రముఖులు నలుగురు క్లింటన్‌తో భారత్‌కు రావటం గమనించదగ్గవిషయం. వారిలో ఇద్దరు హైద్రాబాద్‌కు చెందినవారు కావటం విశేషం. వారిలో ఒకరు 'రేఖా చలసాని' క్లింటన్‌తో వైట్ హౌస్‌లో పనిచేస్తున్న 'మోనామెహబూబ్' రెండవవారు. వారు ఈ నిరసన ప్రదర్శనల మాటవినినా, ఒకవేళ చూచినా వారి మనోభావాలు ఎలా ఉంటాయి? క్లింటన్ పర్యటనను సద్వినియోగపరుచుకోవటానికి ప్రయత్నించాలిగాని, ఆయన పర్యటనే నిరసించడం, తిరస్కరించడం ఏ మాత్రం సమంజసం కాదు, సంస్కారం అంతకన్నాకాదు. మనలో ఎన్నైనా సిద్ధాంతవిబేధాలు వుండవచ్చును. కాని విదేశాల అతిథులు వచ్చినప్పుడు వారి ఎదుట మన విబేధాలను ప్రదర్శించడం విజ్ఞతకాదు. పై పెచ్చు దేశసమైక్యతకే హాని తలపెట్టిన వారమవుతాము కనుక భవిష్యత్తులోనయినా ఇటువంటి దుస్సంఘటనలు పునరావృత్తం కాకుండా ప్రతిపౌరుడు, ప్రతిరాజకీయ పక్షము జాగ్రత్త పడవలసిన

తరువాయి 3వ కవర్‌పేజిలో

ఏప్రియల్ 2000

సంపుటి 16 సంచిక 4


# శ్రీవాణి

## సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137



Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***


| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |


*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**7-04-2000**


## విషయసూచిక



నోబెల్ బహుమతి గ్రహీత, మానవతావాది, మేటి మేధావి

# ఐన్‌స్టీన్

# నోబెల్ బహుమతి గ్రహీత, మానవతావాది, మేటి మేధావి

# ఐన్‌స్టీన్

సింహం జూలులాంటి జుట్టు మెడమీద వరకూ వస్తుంది. గంభీరమైన మీసాలు, దీనత, విజ్ఞానతృష్ణ ఉట్టిపడే చారెడేసికన్నులు, కోటేరుపోసిన ముక్కు ఆకృతి కల్గిన ఆల్బర్ట్ ఐన్‌స్టీన్ రూపం చూడగనే ఒక మహనీయుడు, విజ్ఞాని అనే మనోభావాలు కల్గింపజేస్తాయి. విశ్వగతికి, ఐజాక్ న్యూటన్ పిదప ఒక వినూత్న నిర్వచనం, అందింప జేసి సహస్రాబ్దిలో పేరెన్నికగనిన మేటి మేధావి ఐన్‌స్టీన్. ప్రకృతిని ఆరాధించి, ప్రకృతి రహస్యాలను బయల్పెడల జేసిన ఘన శాస్త్రవేత్త, దేశదేశాలు సంచరించి, చివరకు భారతదేశము కూడ సందర్శించి పెక్కు విషయములు దెలిసికొన్న విజ్ఞానపిపాసి, మానవ విధ్వంసమునకు మూల కారణమైన నాటి అణు శాస్త్రపరిశోధనలు ప్రపంచమునకు దెల్పి, చివరకు అణువిధ్వంస పరిణామములు అరసి శాస్త్రీయ విజ్ఞానము కల్గజేయు వినాశనమును గ్రహించి, భేదనతో, వేదనా హృదయుడై, తుదకు ప్రపంచమున శాంతి వృద్ధి కావలెనన్న మహాత్మాగాంధీ బోధనలు అనుసరణీయమేనని ఎలుగెత్తి తెల్పిన మహనీయుడు ఐన్‌స్టీన్. ఇట్టి మహనీయుని జీవిత చరిత్ర, ఆయన జీవిత కాలమున జరిగిన సంఘటనలు, అత్యంత ప్రధానములైనవి, మనము తెలిసికొనుట ఆవశ్యకము.

**పూవు పుట్టగనే పరిమళించును కదా!** లేదు ఐన్‌స్టీన్ బాల్యము తెలిసికొన్నచో పూవుపుట్టగనే మొగ్గగా నున్నప్పుడు పరిమళించినట్లు కాన్పింపదు. పరిమళము, జీవిత పుష్పము వికసించిన పిదపయే జరిగినది. కాని ఆ పుష్పమొక మహిమాన్విత పుష్పమని మొగ్గగ నున్నప్పుడు కూడ తెలియ వచ్చును. బడి పాఠాలు సరిగా చదివేవాడుకాడు. ఎప్పుడూ ఏవేవో పిచ్చి పనులు, పిచ్చి భావాలతో ప్రొద్దు గడిపేవాడు. అయితే అది కూడా ఒక గొప్ప విశేషంగా ఉండేది. నీటిలో రాయివేసి ఆ రింగులు చూస్తూ ఉండిపోయే వాడు.

సూర్యోదయ వర్ణకాంతులు, మలయ మారుత పవనాలూ, పక్షుల కిలకిలారావాలు, చెట్లు చేమలూ తిలకిస్తూ ఏదో పరవశత్వం పొందేవాడు. ముఖ్యంగా చెట్ల ఆకులను సంపాదించి వాని ఆకృతిలోగల అందచందాలు చూచి నివ్వెరపోతూ ఉండేవాడు. రాత్రులు నక్షత్ర సముదాయం పరికిస్తూ అలాగే ఉండిపోయేవాడు. పాఠాలు వద్దు, చదువులూ వద్దు, ఇదీ ఐన్‌స్టీన్, చిన్ననాటి కథ.

తండ్రి "నువ్వెందుకూ పనికిరావురా, చదువూ సంధ్యా లేదు. సోమరిపోతువి," (Lazygoose) అంటూ మందలించే వాడు. అలా తండ్రి బాధ్యత నిర్వర్తించేవాడు. మరి తల్లి సంగతి చూద్దాం. "మీరు వాణ్ణి తిట్టబోకండి, వాడెప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉంటాడంటే అది గొప్ప. వాడు ఒకప్పుడు ప్రొఫెసరు అవుతాడు, చూడండి" అనేది. అది మాతృ హృదయం. ఆ మాతృమూర్తి ఆశీఃఫలితమే కాబోలు కేవలం డాక్టరేట్ బిరుదు కాకుండా నోబెల్ బహుమతి అందు కునేటంతటి ఘనుడైనాడు ఐన్‌స్టీన్.

**డా॥ రాపర్ల జనార్దనరావు**

సంగీత సాహిత్యాలంటే ఎంతో ప్రేమ. వయొలిన్ బాగా వాయించేవాడు. వాయిస్తూ పరవశుడైపోయేవాడు. గంటల తరబడి ఒడలు మరచేవాడు. తల్లి బాగా వయొలిన్ వాయించేది. ఆమెవద్ద నేర్చాడు వయొలిన్ వాద్యం. "గొప్ప సంగీతకారుడు, గొప్ప శాస్త్రవేత్త ఒక్కడే. ఇద్దరూ కూడా గొప్ప కవులే" అంటాడు ఐన్‌స్టీన్, పెద్దవాడైన పిదప బడికి వెళ్తే అచ్చట క్లాసులో మాష్టార్ని అనేక ప్రశ్నలడిగి అడ్డ దిడ్డాలు పెట్టేవాడు. ఒకసారి మాష్టారు క్లాసులో "ఆల్బర్ట్, నీకేమైనా అనుమానాలు వస్తే, క్లాసులో ప్రశ్నలు అడగబోకు, బయట అడుగు. లేకపోతే మిగతా పిల్లల సమయం వృధా అవుతుంది" అన్నాడట. తల్లితండ్రులు ఐన్‌స్టీన్ ఇక అచ్చట వుంటే చదువురాదని గ్రహించి ఒక మిత్రుని ఇంటికి మ్యూనిక్ ('మ్యూనిచ్' అని అంటాము. కాని మ్యూనిక్ అని ఉచ్చరించాలి) పంపించేశారు. ఇది ఉపాధ్యాయులు విని 'పీడవిరగడయిందిరా' అనుకున్నారట పాపం! ఐన్‌స్టీన్ చేసిన తప్పేమి? భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ 'తద్విద్ధి ప్రణిపాతేన, పరిప్రశ్నేనసేవయా" అని విజ్ఞాన సముపార్జనకు ఉపాయం తెల్పుతాడు.గురువు పాదములకు నమస్కరించి, మరల మరల ప్రశ్నలు (పరిప్రశ్నేన) అడిగి, తెలిసికొనుమని అర్జునునకు గీతలో బోధిస్తాడు.

**జన్మవృత్తాంతం** : దక్షిణ జర్మనీలో డాన్యూబ్ నది వద్దగల ఊల్మ్ అనే చిన్ని పట్టణంలో 1879 మార్చి 14వ తేది యూదు కుటుంబంలో జన్మించాడు ఐన్‌స్టీన్. తండ్రి ఎలక్ట్రికల్ ఇంజనీరు. చిన్ని చిన్ని పరికరాలు చేసేవాడు. తల్లి సంగీత సాహిత్యాలు పుత్రునికి నేర్పింది. మ్యూనిక్ (జర్మనీ) నుండి జూరిక్ చేరాడు. ఇది దక్షిణ స్విట్జర్లాండు లోని ఒక నగరం. అచట టెక్నికల్ కాలేజీ నుండి డిగ్రీ సంపాదించాడు. 1901లో స్విస్ పౌరునిగ సిటిజన్ షిప్ సంపాదించాడు. అచట బెర్న్ అనే స్విస్ నగరంలో ఒక పేటెంట్ సర్టిఫికేట్లు ఇచ్చే ఒక కంపెనీలో చిన్ని గుమాస్తాగా చేరాడు. పేటెంట్ హక్కులకి విపణి వీధిలో చలామణి అయ్యేందుకు ఉత్పత్తిదారులు సమర్పించే అర్జీపత్రాలనన్నింటిని ఆమూలాగ్రంగా చదివి అవలోకనం చేసికొంటూ వారిలోని ఘనతను తెలిసికొని లోలోన వారిని ప్రశంసించుకునేవాడు. అచటనే 1905లో డాక్టరేట్ బిరుదు సంపాదించాడు. తల్లి "మనవాడు ఒకనాడు ప్రొఫెసర్ అవుతాడు చూడండీ" అనిన మాతృవాక్యాల ఆశీస్సులు సత్యమైనాయి. 26 ఏళ్ళకే డాక్టరేట్ బిరుదు పొందిన మేధావి, ఐన్‌స్టీన్.

1905వ సంవత్సరంలో సాపేక్ష సిద్ధాంతం ప్రపంచ విజ్ఞానగతిని, నూత్నమార్గంలోనికి మలచిన సిద్ధాంతాన్ని వెలువరించాడు. బెర్న్ నగరంలో అంతటి మహనీయుడు ఒక చిన్న పత్రికా సంపాదకుని గదిలోనికి వెళ్ళి చేతులు కట్టుకుని 'నా పేపర్లను మీ పత్రికలో ప్రచురించండి స్వామీ' అని విధేయతతో ప్రార్థించగా, అవి ప్రచురింపబడి ప్రపంచ విఖ్యాతిని ఆకర్షింపజేసి 1921లో అనగా 16ఏళ్ళ అనంతరం అతనికి నోబెల్ బహుమతి లభింపజేసింది. ఇది ఫి శాస్త్రంలోని పరిశోధనల ఫలితం.

**సాపేక్షసిద్ధాంతం** (Theory of Relativity) : 1905వ సంవత్సరములో లోగడ సర్ ఐజాక్ న్యూటన్ తెల్పిన సిద్ధాంతాలకు భిన్నంగా క్రొత్త భాష్యం చెప్పి, భౌతిక ప్రపంచాన్ని గూర్చిన మానవుని అవగాహనలు తారుమారు చేసి విభ్రాంతికరమైన వినూత్న విషయాన్ని లోకానికి అందచేశాడు. ముఖ్యంగా స్థల, కాల, చలనాల గూర్చిన విశేషాలతో-ఇమిడి ఉంటుంది ఈ సిద్ధాంతం. విశ్వానికి పొడుగు, వెడల్పు, ఎత్తుతో బాటు నాల్గవ కొలత కాలం (టైమ్). స్థలాన్నీ, కాలాన్ని విడదీయలేము. దీనినే "స్పేస్ టైం కంటిన్యూం" (Space time Continum) అంటారు. దీనిని ఎలా నిరూపించటం అని అందరూ ప్రశ్నించారు. 1919 మే 29న సూర్యగ్రహణం సంభవించింది, ఐన్‌స్టీన్ నూత్నసిద్ధాంతాల్ని పరీక్షకు గురిచేయగా, ఆ సిద్ధాంతాలు సత్యములే అని ఋజువు చేయబడి ప్రపంచశాస్త్రజ్ఞుల అంగీకారాన్ని బడసినాయి. ఒక వస్తువు చలనం కనుగొన వలెనంటే మరొక వస్తుచలనంతో పోల్చబడాలి. దీనిని చలన సాపే సిద్ధాంతం అంటారు. ఐనస్టీ ముఖ్యంగా కాంతి కిరణం యొక్క వేగం నిశ్చయం (Fixed) అని తెల్పుతాడు. ఆయన చేసిన ఫోటో ఎలక్ట్రిక్ ఎఫెక్టు వలననే నేటి టివి ట్యూబులు పనిచేయబడుతున్నాయి. ఆతని శక్తి పదార్థ నిష్పత్తి అణుశాస్త్రాభివృద్ధికి మూల కారణమైంది. "ఇ = యం. సిస్క్వేర్ E = Mc² = Energy అనగా Mass Velocity Square వలన ఉదయిస్తుంది అన్నది ముఖ్య సిద్ధాంతం.

**ప్రపంచపు గుర్తింపు** : తన పరిశోధనలవలన పేటెంటు ఆఫీసునుండి విముక్తి పొందాడు. యూరపు దేశాలలో అనేక తావుల విద్యాలయాలలో వృత్తి పరంగా పేరు పొందాడు. 1914లో బెర్లినులో స్థిరపడ్డాడు. అచ్చటగల కెయిజర్ విల్‌హెల్మ్ ఇనిస్టిట్యూట్‌లో భౌతిక శాస్త్రం (ఫిజిక్స్)లో అధినేతగా 1914 నుండి 1933 వరకూ కొనసాగారు. జర్మనీ రావటానికి ఇష్టపడని మొదటి భార్య ఇద్దరు పిల్లలను తీసుకొని జ్యూరిక్‌కు వెళ్ళిపోయింది. 1919లో ఎల్సాన్‌ను వివాహమాడాడు. 1921లో నోబెల్‌బహుమతి అందు కున్నాడు. మొదటి ప్రపంచ యుద్ధంలోని మారణహోమం చూచి ఖేదన పొందాడు. హిట్లరు జర్మనీలో ఆధిపత్యం పొంది యూదులను ఊచకోతగా వధిస్తుంటే (holocaust) 1933లో జర్మనీ వదలి వెళ్ళవలసి వచ్చింది. ఐన్‌స్టీన్‌ను పట్టిఇచ్చిన వారికి 20 వేల మార్కులు బహుమతి నాజీలు ప్రకటించారు. ఐన్‌స్టీన్ జర్మనీ వదలి ఫ్రాన్సు చేరుకున్నాడు. అచట నుండి అమెరికాలోని ప్రిన్స్‌టన్ న్యూజెర్సీ రాష్ట్రం లోని నగరం చేరుకున్నాడు. ఈ పట్టణం చరిత్రాత్మక మైనది. ఇచ్చటనే వాషింగ్‌టన్ అమెరికా సైన్యంతో బ్రిటీష్ వారిని ఓడించి అమెరికా రాష్ట్రముల అధినేత అయ్యాడు.

**కొన్ని ముఖ్యమైన జీవితవిశేషాలు :**

హిట్లరు నాజీ నియంతగా ఆటం ఆయుధాలను సేకరించుచుండుట తెలిసి ఆనాటి అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూజ్‌వెల్ట్‌కు 1939వ సంవత్సరం ఒక లేఖలో అమెరికా కూడ అణుశక్తిని సంపాదించే యత్నంనకు ముందంజ వేయాలని కోరాడు. ఈ లేఖ చరిత్రాత్మక మైనది. అమెరికా దీనివలననే అణుశక్తి పరిశోధన "మన్‌హటన్ ప్రాజెక్టు" అనే రహస్య నామంతో అణుబాంబు

లను నిర్మించి రెండవ ప్రపంచయుద్ధపు చివరి భాగములో జపానులోని హిరోషిమా, నాగసాకి పట్టణాలపై అణుబాంబు లను వేసి రెండవ ప్రపంచయుద్ధాన్ని ముగింపు చేయడం జరిగింది. ఈ అణువిధ్వంస మారణహోమం చూచి ఆనాటి నుండి ఐన్‌స్టీన్ అహింసావాదిగా మహాత్మాగాంధీని ఆదర్శ పురుషునిగా భావించి జీవిస్తాడు.

రెండవ ప్రపంచయుద్ధానంతరం ఇజ్రాయిల్ దేశం ప్రధమంగా రూపుదాల్చింది. 1952లో ఇజ్రాయిల్ అధ్యక్షునిగా ఉండవలసినదిగా ఆ దేశం ఐన్‌స్టీన్‌ను ప్రార్థించింది. ఐన్‌స్టీన్ ఆ పదవికి ఆశపడక అమెరికాలో కన్నుమూశాడు 1955లో.

ఇంతటి మేధావి, అణుశక్తికి కారణభూతుడైనవాడు తన పరిశోధన ఫలితమువలననే కదా విధ్వంసం జరిగినదని జరుగవచ్చునని, ఎంతో వేదనాత్మకుడై ప్రపంచంలో మహాత్మాగాంధి బోధనలే దివ్యబోధనలని తలచి తూర్పు దేశాల పర్యటన సల్పుతాడు. ఇలాగే విధ్వంసానికి మానవ మారణహోమానికి కారణభూతుడైన డైనమైట్‌లు కనిపెట్టిన నోబెల్ స్వీడిష్ దేశస్థుడు, పశ్చాత్తాపపడి తన యావత్తుధనం నోబెల్ బహుమతులు శాంతి విజ్ఞాన శాస్త్రములకు ఏర్పాటు చేశాడు. అలాగే మన చరిత్రలో కళింగ యుద్ధము చేసిన అశోకుడు బౌద్ధమతము స్వీకరించి ప్రచారం చేశాడు.

ఐన్‌స్టీన్ భారతదేశం సందర్శించాడు. ఇచ్చట చేతితోలాగే రిక్షా బండి మనిషిని కూర్చుండబెట్టి, మనిషి ఒక గుర్రంలాగా పరుగెత్తుతు, లాగటంచూచి బాధతో నిర్వీణ్ణుడౌతాడు. (నేటికీ కలకత్తాలో ఇలాంటి చేతితో లాగే రిక్షాబళ్ళుఉన్నాయి.) మొదటనే 'మానవతనిండిన మేధావి' అని తెల్పుకున్నాముగదా. ఇలాంటి రిక్షాలో తాను ఎప్పుడూ ఎక్కకూడదని నిర్ణయించుకున్నాడు. ఐన్‌స్టీన్ ఒక మేధావి మాత్రమే కాదు, ఎంతో వినయశీలి, "విద్యయొసగును వినయంబు" అనిన భర్తృహరి సుభాషితానికి మారుపేరు, ఐన్‌స్టీన్. ఈ నోబెల్ బహుమతి గ్రహీతను అమెరికాలో ఒక పెద్ద యూనివర్సిటి ముఖ్యోపన్యాసానికి ఆహ్వానించి, ఘనమైన స్వాగత ఏర్పాట్లు యూనివర్సిటి ద్వారం వద్ద చేసి నిరీక్షిస్తుంటే, ఐన్‌స్టీన్ ఆ ఆర్భాటాలు గిట్టనివాడై, ఇంకొక ద్వారంలో చడీ చప్పుడు లేకుండా ప్రవేశించి కుర్చీలో కూర్చున్నాడు. ఇది తెలిసికొని బయట ఉన్న బృందం అంతా పరుగున లోనికి వచ్చి "ఇదేమిటండీ" అని నివ్వెరబోతే "అవన్నీ వద్దు విషయచర్చ కావాలి" అన్నాడు ఆ వినయశీలి. ఒకసారి బెల్జియం దేశపురాణి, ఐన్‌స్టీన్‌ను ఆహ్వానించింది. ఐన్‌స్టీన్ తన వయొలిన్ పెట్టి, ఇంకొక చేతిలో సూట్‌కేస్ పుచ్చుకుని రాజ ప్రసాదంలోనికి నడుచుకుంటూ వెళ్ళాడట. రాణీ, ఆమె పరివారం నిర్ఘాంత పోయారుట ఆతని నిరాడంబరత చూచి.

**ఒకసారి ఏమైనదంటే!**

అమెరికాలో పేరు ప్రఖ్యాతులతో ఉండగా, ఒక అమెరికన్ పిల్ల తల్లిని "అమ్మా, మన ప్రక్క ఇంటికి వచ్చిన క్రొత్త అంకుల్ ఎవరు" అని ఐన్‌స్టీన్ గూర్చి అడిగిందట. ఆయన ఫిజిసిస్టు అని చెప్తే పిల్లకు అర్థం కాదు, ఇంకా వెధవ ప్రశ్నలు వేస్తుందని "ఆయనకు బాగా లెఖ్ఖలు వచ్చును" అందిట. ఆ చిన్ని పిల్లకు లెఖ్ఖల ప్రోబ్లెమ్స్ టీచరు ఇచ్చిన హోంవర్కు అర్థం కాలేదుట. తల్లిలేకుండా ఐన్‌స్టీన్ ఇంటికి వెళ్ళి తలుపుకొట్టిందిట. ఐన్‌స్టీన్ తలుపు తీసి చూస్తే అందమైన చిట్టి పిల్ల! "అంకుల్! నాకు టీచరు ఇచ్చిన లెక్కలు హోంవర్కు అర్థం కాలేదు నీవు హెల్ప్ చెయ్యవా?" అని నోబెల్ బహుమతి గ్రహీతను అడిగిందిట. వినయశీలి, నిగర్వి, ఐన్‌స్టీన్ "రా! అమ్మా" అని లోపలికి పిలిచి లెఖ్ఖలు బాగా బోధించి, చేయించి, పంపాడు. మరుసటి రోజా ఆ చిట్టి అలాగే చేసింది. ఐన్‌స్టీన్ లెక్కలు మాష్టరు అవతారం దాల్చి, లెఖ్ఖలు ఆ చిన్నిపిల్లకు బోధిస్తూనే ఉన్నాడు. కోపం గర్వం లేని మానవతతో నిండిన మేధావి ఈలాగు, మూడు రోజులు గడిచిన పిదప ఆ పిల్ల తల్లితో ఒక రోజున "అమ్మా! నీవు చెప్పినట్లు ఆ అంకుల్ లెక్కలు బాగా చెప్తాడు" అందిట. తల్లి ఆరాదీసి ప్రశ్నలడిగి నిజవిషయం తెలుసుకుని అయ్యో అంతపెద్దవానిని మా అమ్మాయి ప్రాధమిక గణిత సూత్రాలు అడిగి ఇన్ని రోజులు చెప్పించుకుంటూ ఆ మహా మేధావి అమూల్యమైన కాలాన్ని వృధా చేసింది కదా, దీనికి క్షమాపణ వేడాలని, నిశ్చయించు కుని, పిల్లను వెంటదీసికొని ఐన్‌స్టీన్ వద్దకు వెళ్ళింది. 'మా అమ్మాయి తెలియక తప్పు చేసిందండి క్షమించండి' అని వేడిందిట. ఐన్‌స్టీన్ చిరునవ్వుతో "అదేమిటి! క్షమించటమేమిటి? ఆమెకు నేను థాంక్సు చెప్పాలి. ఆ పిల్లకు ఇచ్చిన ప్రశ్నలకు సమాధానాలు కొరకు నేను ప్రయత్నిస్తూ నేనుకూడా అనేక నూత్నవిషయాలు ఆమె ప్రశ్నల వలన తెలిసికొన్నాను. నాకు లాభం జరిగింది" "I have to thank her" అన్నాడుట. మానవతా హృదయం, మమతలు నిండిన హృదయం మరి.

ఇంతటి మేధావి, ఎప్పుడూ నూత్నవిషయాలపై ధ్యానం చేసే మహనీయవ్యక్తి సామాన్య విషయాల మీద ధ్యాస

ఉండేది కాదంటే విచిత్రంకాదూ! ఒకసారి ఇంటికి వెళ్ళాలి, ఆఫీసునుండి, ఇంటి వీధిపేరు, నెంబరు మరచిపోయాడుట అంతటి మేధావి! ఎలాగో డైరీ వెదికి వాళ్ళ ఇంటి ఫోన్ పట్టుకొని తన కూతురుకు "అమ్మాయీ! మన ఇల్లు ఏ్రస్ట్రీట్‌లో ఉందమ్మా! ఇంటి నెంబరు?" అని అడిగాడంటే ఎంత తమాషా?

ఇంకొక సారి తన ఇల్లు అనుకొని ఇంకొక ఆవిడ ఇంట్లోకి వెళ్ళి కూర్చుంటే ఇంటావిడ వచ్చి "అదేమిటి? ప్రొఫెసర్! ఇది మీ ఇల్లు కాదు" అని చెప్తే ఐన్‌స్టీన్ 'సారీ' చెప్పి తన ఇంటికి వెళ్ళాడుట. "Absent Minded Professor" అనే పదానికి ఐన్‌స్టీన్ సరిపోతాడు ఒకప్పుడు.

అయితే ఆయనను తక్కువ అంచనా వేయరాదు సుమీ. మన వేదాలు, భగవద్గీత బాగా చదివాడు. గాంధీ గారి మరణవార్త విని ఆయనను ప్రశంసిస్తూ "రాబోయే తరాల ప్రజలు ఈ భూగోళం మీద మహాత్మాగాంధీ వంటి వ్యక్తి ఒకనాడు నడిచినాడని తెలిపితే, నమ్మలేరు" అన్నారు.

మానవత, దైవభావనలేని విజ్ఞానం ఎంత మాత్రం అంగీకరించరాదు అంటాడు. దైవభావన, విజ్ఞానముల మేటి కలయిక ఆయన వాంఛించాడు. ఆయన ప్రవచనాలు ప్రఖ్యాతి చెంది ప్రపంచవ్యాప్తి పొందినాయి.

**ఆయన జీవితంలోని కొన్ని ముఖ్య ఘట్టాలు :**

ఒకసారి గోడమీద బొమ్మ మార్చాలని నిచ్చెన వేసికొని బొమ్మ తీసేలోపు ఏదో విజ్ఞాన విషయం మీద ధ్యానంలో మునుగగా కాలు జారి నిచ్చెన మీద నుండి ఢమ్మని క్రిందపడ్డాడు. న్యూటన్‌కి క్రిందపడిన యాపిల్ ఎలాగు ప్రసిద్ధమైనదో ఐన్‌స్టీన్ నిచ్చెన మీద నుండి క్రింద పడటం అలాగా వినూత్న ఆలోచనల్ని రేకెత్తింపజేసి న్యూటన్ సిద్ధాంతము వస్తువులన్నీ స్థిరములని తెల్పితే ఐన్‌స్టీన్ వస్తువులన్నీ కదలికలో ఉంటాయని తెల్పి Conqueror of Newton అని పిలువబడ్డారు. ఒక కర్రముక్కకు కాంతి కిరణవేగం సంధింపజేయుగల్గితే అది కదులుతోంది.

మనం చూచే ఈ నక్షత్రాలు కొన్ని మిలియన్ల క్రితం అక్కడ ఉన్న పురాతన నక్షత్రాలు ఆ కిరణం ఇక్కడికి చేరేటందుకు కొన్ని మిలియన్ల ఏళ్ళు పడుతుంది.

కాంతి కిరణాల వలన ప్రపంచం అంతా సమమైన గీతలుగా గాక ఒంపులు ఒంపులుగా ఉంటుంది. రెండు చుక్కలను కలిపే దగ్గర ఉన్న రేఖ సమమైనదిగా ఉంటుంది అని శాస్త్రం చెబితే ఆ రేఖ సమంగా కాక వంపు 'కర్వ్'గా ఉంటుందని తెల్పి ప్రపంచాన్ని సందేహంలో నింపి సూర్య గ్రహణం రోజున తన సిద్ధాంతాన్ని శాస్త్రజ్ఞుల చేత అంగీకరింప జేశాడు. ఆనాటినుండి ఐన్‌స్టీన్‌ను పిచ్చివాడు అన్న వారందరూ చేతులు జోడించారు.

"ధనసముపార్జన అంటే ఆయనకు ఇష్టం లేదు. I am absolutely Convinced that no wealth in the world can help humanity forward " మానవ ప్రగతికి ధనం కాదు కావలసినది ప్రశాంత స్థితి, మానవప్రేమ "Permanent Peace and lasting goodwill" కావాలంటాడు. ఒకసారి ఒక పత్రికాధిపతి ఐన్‌స్టీన్ వ్యాసానికి పెద్ద మొత్తంలో చెక్కు ఇస్తే ఆయన భార్యతో "ఈయన నన్నేదో, సినిమాతార క్రింద లెక్క కట్టాడు" అన్నాడుట

ఒకసారి బెల్జియం రాణి ఈయనకు కారు పంపింది రమ్మని ఆహ్వానం పంపి. కాని ఐన్‌స్టీన్ కాలినడకన రాణిగారి భవనానికి చేరాడు "హెర్ ఐన్‌స్టీన్ మీకు కారు పంపించాను గదా?" అని అడిగిందిట. ఐన్‌స్టీన్ "అవును నిజమే కాని ఈ చల్లగాలిలో నాకు నడిచి రావాలనిపించింది వచ్చాను" అన్నాడుట. ఐన్‌స్టీన్‌కు కార్లు అంటే ఇష్టం ఉండేదికాదట వీలైనంతవరకూ నడిచేవాడట.

జపానులోని చిఱుపాపల్ని చూచి "In the Children lies the hope of the world" బాలలలోనే ప్రపంచ భవిష్యత్తు ఉన్నదని ప్రవచించాడు. ఆయనకు ప్రశంసలంటే గిట్టేదికాదు. Everyone praises me and nobody understands me" "అందరూ నన్ను మెచ్చుకుంటారే తప్ప నన్ను అర్థం చేసికొనేవారే లేరు" అంటాడు.

ఒకనాడు యూదు అని అసహ్యించబడినవాడు, వేరొకనాడు ప్రపంచ విఖ్యాత పురుషుడుగా మారాడు. "అందరూ నన్నొక సర్కసు జంతువులాగ చూస్తూ ఉంటున్నారు" అంటాడు వ్యంగ్యంగా. "ప్రపంచ అభ్యున్నతి శాంతి ప్రియుల మీద, ఆనంద తరంగాలు పెంపొందించే వ్యక్తుల మీద ఆధారపడిఉంటుంది" అన్నాడు. సంగీత ప్రియుడై బిథోవెన్, బాక్ మోజాకుల సంగీతం వింటూ తన్మయుడయ్యేవాడు. నిరంతర గ్రంథ పఠనాసక్తుడు. హెయినే, షిల్లర్, గేథే, గ్రంథాలలో డార్విన్ యూక్లిడ్, న్యూటన్, స్పినోజా, రెకార్టెన్ శాస్త్రజ్ఞుల గ్రంథాలు ఆపోశనం పట్టారు మహిమాన్వితుడు, మానవతనిండిన మేధావి, మరువరాని వ్యక్తి ఆల్బర్ట్ ఐన్‌స్టీన్.

# హృదయం నమ్మకం, పవిత్రతలకు నిలయం కావాలి

"సర్వభూత హితం ఏవ
భజత్యే కష్టమార్జితమ్
సర్వతః పాణిపాదం
తత్సర్వతోక్షి శిరోముఖమ్"

ప్రేమస్వరూపులారా!

సర్వభూతములయందుండినటువంటి ఆత్మ, నీ యందుండినటువంటి ఆత్మఒక్కటే అని గుర్తించినటు వంటి వ్యక్తి, రాగియైన, విరాగియైన, గృహస్థుడైన, కర్మలు చేసిన, కర్మలు చేయకపోయిన - అతను ఎప్పుడూ దైవము తోనే కూడివుంటాడు, దైవముతోనే ఏకమై ఉంటాడు, దైవముతోనే ఆనందాన్ని అనుభవిస్తుంటాడు. వేద శాస్త్రములు వల్లెవేసినా, ఇతిహాసములను తిరగవేసినా, వ్యాస ప్రసంగములను గావించినా, ఇందులో ఆత్మతత్త్వ మనేది ఏమాత్రం కనిపించదు. విశాలమైన వృక్షము పెద్దదిగా కనిపించినప్పటికినీ దాని విత్తనములు మాత్రం చాలా చిన్నవిగా ఉంటాయి. అదేవిధముగనే ఆత్మ స్వరూపుడు సర్వత్రా అణుస్వరూపుడై ఉంటాడు. కాని అతనే బ్రహ్మాండస్వరూపాన్ని ధరిస్తాడు.

మీరు ఆనందమయులు, సంతోషమయులు. కాని మీ యొక్క ఆనందములను, మీ యొక్క సంతోషములను మరచి, ఆనందసంతోషముల కొరకై ఈ జగత్తునందు ఆరాటపడుతున్నారు. నీవే ఆనందమయుడవై, ఆనందం కోసం ప్రపంచమందు వెదకటం - ఇది ఎంత అజ్ఞానం? తన తత్త్వాన్ని తాను గుర్తించడమే ఆధ్యాత్మికం.

ఈనాడు ఇరువురు వైస్‌ఛాన్సలర్స్ పంచకోశములను గురించి వివరించమని ప్రార్థించారు. ఈ శరీరము భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైన అన్నమయకోశము. ఇది భౌతికము అంటారు, ఇది స్థూలము అంటారు. ఈ స్థూలశరీరము కర్మ, ఇంద్రియములచేతను, జ్ఞానేంద్రియముల చేతనూ సర్వత్రా వ్యాపించి ఉండటంచేత వేదము దీనికి 'విశ్వుడు'అని పేరుపెట్టింది. సర్వవిషయముల యందునూ వ్యవహరించటంచేత ఇతనికి **'వ్యావహారికుడు'** అని రెండవ పేరు. ఇతను చిత్తవృత్తిచేత, సర్వమునూ గుర్తించినవాడు కనుకనే, ఇతనిని 'స్వభావుడు' అన్నారు. **'సాత్వీభాషుడు'** అన్నారు. ఈ విధంగా భౌతికమైన ఈ దేహమును అనేక పేర్లతో పిలుస్తూ వచ్చింది వేదం. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయము - ఈ మూడింటిని చేరటం వలన **'సూక్ష్మశరీరము'** అని పిలవ బడింది. ఎందుకోసం దీనిని సూక్ష్మశరీరం అన్నారు. **'ప్రాణం'** మనకు కనిపించదు. 'మనసు' మనకు కనిపించదు.

## భగవాన్ సాయి దివ్యబోధ

**'విజ్ఞానము'** మనకు కనిపించదు. ఈ మూడును కనిపించని ఆకారములు కనుక దీనికి **'సూక్ష్మశరీరము'** అని పేరుపెట్టారు. అంతియేకాదు. ఇది **'ఆధ్యాత్మిక ప్రాణ తత్త్వము'** అని కూడా బోధించారు. దీనికే 'ప్రబోధకుడు' అని మరొక పేరు పెట్టారు. విజ్ఞానము అని కూడా మరొక పేరు పెట్టారు. అయితే ఈ పేర్లు ఎన్నివుండినప్పటికినీ, ఇది 'మనసు'నే ఆధారం చేసుకుంది. 'మనసు' సూక్ష్మ శరీరంగా కనిపిస్తుంది గాని ఇది అనంతంగా వ్యాపించింది. **'మనోమూలం ఇదం జగత్'** జగత్తంతా వ్యాపించింది ఈ 'మనసు'. కనుక దీనిని 'సూక్ష్మ శరీరము' అని పిలిచారు.

దీనికి **'ఆనందమయకోశము'** అని పేరు పెట్టారు గాని, ఇందులో ఆనందము లేదు. ఇది మహాకారణ స్వరూపము. కేవలం ఆనందం వున్నట్లు నటిస్తుందిగాని, ఇది నిజమైన ఆనందముకాదు. దీనికి 'సుషుప్తి' అని మరొక పేరు పెట్టారు. ఆనందం అనుభవించినట్లుగా తోస్తుందే గాని, అది నిజమైన ఆనందము కాదు. అది కేవలం పరిపూర్ణమైనటువంటి మత్తులో ఉంటుంది. దీని తరువాత దానిని **'తురియావస్థ'** అన్నారు. అదియే నిజమైన ఆనందం. అక్కడ ఇంద్రియములచేతగాని, మనసుచేతగాని, బుద్ధిచేత గాని, ఇంకేవిధమైన స్వప్నములచేతగాని కలిగేటటువంటిది కాదు ఈ ఆనందం. దీనినే **'ప్రాతిభాషికము'** అన్నారు. **'పారమార్థిక దైవము'** అన్నారు. కనుక తురియావస్థయందు

కలిగేటటువంటి ఆనందమే నిజమైన ఆనందము. ఇటు వంటి నిజమైన ఆనందమును మనం పొందాలనుకుంటే, దీనికి పంచకోశములు అనేక విధములైన అడ్డులుపెడుతున్నాయి.

మొదటిది అవిద్యాక్లేశము. రెండవది అభినవక్లేశము. మూడవది అస్థితక్లేశము. నాల్గవది రాగక్లేశము. ఐదవది ద్వేషక్లేశము. ఈ ఐదు క్లేశములచేతనే మానవుడు అత్యంత దూరమైపోతున్నాడు. ఆత్మదర్శనం చేసుకోలేకపోతున్నాడు. ఆత్మానందమును అనుభవించలేకపోతున్నాడు. కారణమేమిటి? శరీర అభిమానంచేతనే పంచకోశములను, క్లేశములుగా భావించడం వలన ఈ పాంచ భౌతిక శరీరమునకు అనేక యిబ్బందులు కలిగిస్తున్నాయి.

1. అవిద్యాక్లేశము - ఏ మానవుడు దేహమును అమితంగా ప్రేమించి, దాని నిమిత్తమై జీవితాన్ని అర్పితం గావించునో అదియే అవిద్యాక్లేశము రోగములచేతను, ఆశలచేతను ఈ దేహమును దుఃఖమయంగా చేస్తున్నది.

2. అభినవక్లేశము - సర్వమునూ ఈ జగత్తుగానే భావించి, తన స్వరూపాన్ని తాను మరచిపోవటం. సర్వము నకూ మనసే మూలకారణమని తెలుసుకోకుండా, ఈ ప్రపంచమనే దృశ్యమే ప్రధానమని భావించి అనేక దుఃఖము లకు, విచారములకు గురికావటం మనసును స్వాధీనం చేసుకోలేక, దేహభ్రాంతి వదలలేకపోవటం వలననే పై రెండు క్లేశములు మానవుని బాధిస్తున్నాయి. మనోవాంఛలే ప్రధానమని విశ్వసిస్తున్నాడు. దేహమే ఈ జగత్తుకు ప్రమాణమని భావిస్తున్నాడు. కనుకనే మానవుడు అనేక దుఃఖములకు గురిఅవుతున్నాడు.

3. అస్థితక్లేశము - అనగా విషయభోగముల యందు ఆసక్తి. ఈ విషయభోగములే మానవునకు ప్రధానమని విశ్వసించడం వలన మానవుడు అనేక కష్టములకు గురి అవుతున్నాడు. సకల సుఖములు అనుభవించాలన్న దురాశ పెరుగుతున్నది. ఈ దురాశలో విఫలమైతే లోభం ప్రారంభమవుతుంది. తరువాత అహంకారం పెరుగుతుంది. దురాశ, జయాపజయముల వలన మానవత్వం క్రమేణా క్షీణిస్తున్నది. వికాసం పొందలేకపోతున్నాడు.

4. రాగక్లేశము - ధనకనక వస్తువాహనాదులపైన వ్యామోహం పెరగడం. దీని వలన వాంఛలు పెరుగు తున్నాయి. దీనివలన అనేక విధములైన బాధలకు గురియై పోతున్నాడు మానవుడు.

5. ద్వేషక్లేశము - అనగా ఒక వస్తువును ఆశించి, ఒక వ్యక్తిమీద ఆధారపడుతున్నాడు. తన ఆశ నెరవేరితే తనకు సంతోషం. నెరవేరకపోతే ఎదుటివానిపైన ద్వేషం కలుగు తుంది. సామాన్యులకేకాదు. భక్తులు కూడా ఎన్నో విధము లైన ఆశలతో ఆరాధనలు సలుపుతుంటారు కాని అవి విఫలమైతే భగవంతుని కూడా ద్వేషిస్తారు. దూషణలకు దిగుతారు. ఈనాడు మానవుడు హీనస్థితికి దిగజారుతాడు.

కాబట్టి ఇలాంటి ద్వేషక్లేశములు ఈనాడు ఈ జగత్తులో మితిమీరిపోతున్నాయి? ఈనాడు తల్లిబిడ్డల మధ్య, భార్యభర్తల మధ్య, అన్నదమ్ముల మధ్య ఈ క్లేశముల వలన ద్వేషములు పెరిగిపోతున్నాయి. కనుకనే ఈ పంచక్లేశములు కూడనూ పంచకోశముల ద్వారా మానవుని బంధితుని గావిస్తున్నాయి. కనుక మానవుని యొక్క సుఖశాంతులకు మూలాధారమైనటువంటిది ఆనందమయ కోశమే. ఈ ఆనందం తురియావస్థలోనికి పోయినప్పుడే మనకు లభ్యమవుతుంది. అయితే మనం ఈనాడు అప్రాప్తమైన ప్రాప్తికై ప్రాకులాడి, చిక్కిన ప్రాప్తినికూడా వదలుకొని ఆనందమునకు దూరమైపోతున్నాం ఈ ప్రాతిభాషికుడు అనేటటువంటి వ్యక్తితో మనం శాంతిని పొందలేకపోతున్నాం. కనుకనే పారమార్థికము అనే తత్త్వాన్ని మనం గుర్తించాలనుకుంటే మనసును మనం దూరం చేసు

## విక్రమాబ్దీ! స్వాగతం

ఉదయారుణమరీచు లుర్విపైబరచిన
బంగారు పుట్టంబు పగిదిదోప
తెలిమంచు తెరలెల్ల తొలగి పోవగతమ్మి
పూవులు మోముల నవ్వుజూప
చిగురుమేసిన వేడ్క చెలగి కోయిల జతల్
తీయని రాగాల హోయినింప
అర్పిత పంచాంగమాలించి తమ గ్రహ
చార లెఱుంగ ముచ్చటపడంగ
ప్రకృతి భీభత్సములు దుష్టపాలనములు
అంతమొందించి అధిక సస్యాదులిచ్చి
ధనసమృద్ధితో శాంతి జీవనమొసంగ
రాగదే విక్రమాబ్దమ! స్వాగతం!!

పృథివి సుబ్బనాగయ్యకవి, మచిలీపట్నం

కోవాలి, లేక అదుపులో ఉంచుకోవాలి. దేహాభిమానమును క్రమక్రమేణా తగ్గించుకోవాలి. ఈ దేహాభిమానము వుండి నంతవరకునూ 'దేహి' మనకు ఏ మాత్రం అర్థంకాదు.

ప్రపంచంలో మానవుడు అనుభవించే అశాంతికి, అసంతృప్తికి, కష్టములకు, దుఃఖములకు, విచారములకు అన్నింటికీ ఈ దేహాభిమానమే మూలకారణం. కనుక ఈ దేహమును ఒక పనిముట్టుగా తీసుకొని, 'దేహి' యొక్క తత్త్వమును లక్ష్యమునందుంచుకొని, మన నిత్యజీవితమును సత్యజీవితంగా ఎంచుకొనిపోవాలి.

ప్రతి పదార్థమునకు ఒక మూలాధార వస్తువుంటుంది. ఈ ప్రాకృత జగత్తు అంతయునూ ఒక మూలాధారము నుండియే ప్రారంభమైంది. మూలాధారమును మనం వదిలితే సర్వమునూ వదిలినవారమవుతాం.

ఉదాహరణ. ఇది ఒక వెండి ప్లేటు. ఇది ఒక వెండి గ్లాసు. ఇది ఒక వెండి చెంబు. ఈ రూపనామములు వేరు. కాని ఇవన్నీ మూలాధారమైన వెండి నుంచి తయారైనవే. ఈ మూలాధారమైన వెండిని మనం విసర్జించుతే, రూప నామములకు ఏ మాత్రం విలువలేదు. ఈ ప్లేటును చెడ కొట్టి కొన్ని స్పూన్లను చేయవచ్చును. ఈ ప్లేటుకు మరణం వచ్చింది. ఆ స్పూన్లు చెడకొట్టి మరొక చిన్న కప్పును తయారుచేయవచ్చును. కాబట్టి రూపనామములు అన్నీ కూడనూ మార్పుచెందునవే. రూపనామములు అన్నీ కూడా మరణించునవే. కాని ఈ రూపనామములకు మూలాధారమై నటువంటి వస్తువు మాత్రం ఏనాటికీ మరణించదు.

**"చావు పుట్టుకలేనట్టి శాశ్వతుండు**
**ఆది మధ్యాంతరహితుడనాదివాడు**
**తాను పుట్టక చావక చంపఁబడక**
**ఆత్మరూపుడై తానదె వెలసియుండు"**

నిత్యసత్యమైనటువంటివున్న అనాది తత్త్వమే దీనికి మూలాధారము. కనుక మనం ఏ వస్తువును చూచినా దానికి మూలాధారమును మనం వెదకాలి. ఈ దేహము నకు మూలాధారము ఏమిటి? ఈ మనసుకు మూలా ధారము ఏమిటి? ఈ ప్రాణమునకు మూలాధారము ఏమిటి? వీటన్నింటికి ఒక్క దివ్యత్వమే మూలాధారము. చూడండి! ఈ సముద్రంలో నీరు ఉన్నది. దీని మూలాధార తత్త్వానికి ఎన్ని లింకులో కనిపిస్తున్నాయి. సూర్యరశ్మిచేత ఈ సముద్రజలం ఆవిరిగా మారుతున్నది. ఆ ఆవిరి మేఘములుగా రూపొందుతున్నాయి. ఈ మేఘములపైన చల్లనిగాలి వీచినప్పుడు అవి తిరిగి వర్ష బిందువులుగా క్రిందపడుతున్నాయి. ఆ వర్షబిందువులే ప్రవాహంగా రూపొందుతున్నాయి. ఈ ప్రవాహములే తిరిగి సముద్రము లో చేరిపోతున్నాయి. సముద్రము నుండి వదిలిన ఈ జలము ఎన్ని రూపములో ధరించింది. ఆవిరిగా మారింది. మేఘములుగా రూపొందింది. వర్షముగా కురిసింది. నదులుగా ప్రవహించింది. కట్టకడపటికి సముద్రములో చేరిపోయింది. "నదీనాం సాగరో గతిః". అదేవిధముగనే ఈ జగత్తులో పుట్టినటు వంటి ప్రాణులు కాని, వ్యక్తులు కానీ, ఇంకేవిధమైన వస్తువులు కాని అన్నీ ఒక మూలా ధారము నుండి ఏర్పడినటువంటివే. కట్టకడపటికి ఈ మూలాధారములోనే చేరిపోవాలి. దానినే వేదాంతం 'ముక్తి' అని పేరు పెట్టింది. కనుకనే భాగవతము నందు కూడా **'ఎచ్చట పుట్టి నచ్చటికి జేరుట నైజము ప్రాణి కోటికిన్'** అనింది. ఎచ్చట పుట్టిందో, అచ్చటికి చేరిపోవుట దీని తత్త్వము. కనుక 'ఆత్మ' కూడనూ దైవము నుండి ప్రారంభమైనటువంటిదే. ఈ దేహము నందు ఉండినంత వరకునూ ఇవే కర్మలను ఆచరిస్తూ ఉంటుంది. దీనికి 'కర్తవ్య స్వరూపము' అన్నారు. సుషుప్తిలో మనం అనేక చర్యలు చూస్తుంటాం. సుషుప్తి అంటే గాఢ నిద్ర కాదు. అందులో కూడనూ కొన్ని స్వప్నములు ఏర్పడుతుంటాయి. అసలు ఈ స్వప్నములు ఎక్కడ నుండి వచ్చాయి? అయ్యా! ఈ స్వప్నములకు మూలకారణం ఏమిటి? అని ఎవరినైనా ప్రశ్నిస్తే తలంపులే దీనికి మూలకారణమని కొందరు చెబుతారు. భావములే దీనికి మూలకారణ మంటారు మరికొందరు. కాదు.... కాదు.... ఏదీకాదు. స్వప్నములకు మూల కారణం నిద్రయే. నిద్ర రావటం చేతనే గదా! స్వప్నం వచ్చింది. నిద్రయే లేకపోతే స్వప్నమే లేదు కదా! కనుక ఈ స్వప్నములకు నిద్ర మూలకారణం. అయితే ఈ నిద్రలో వచ్చిన ఈ స్వప్న స్వరూపాలకు ఏది కారణం? జాగ్రత అవస్థయందు అనుభవించినటువంటి సర్వానుభూతులు కూడనూ, సంస్కారరూపంలో అంతః కరణలో లీనమై పోతుంటాయి. కనుకనే తేజోవంతమైనటు వంటి సంస్కారం చేతనే రూపొందినటువంటి యొక్క తత్త్వము కనుకనే, ఇతనికి 'తైజసుడు' అని పేరు పెట్టారు. ఇలాగే ఒక్కొక్క దానికి ఒక్కొక్క పేరు కారణం లేకుండా ఏర్పడలేదు.

ప్రేమ స్వరూపులారా!

ఆధ్యాత్మికము అంటే ఏమిటి? ఇది కేవలం ఒంటరి తనమని కాని, ఏకాకి జీవితమని కాని భావించరాదు. రాగ ద్వేషములు లేనటువంటి తత్త్వమే ఆధ్యాత్మికము. సర్వ మానవకోటిని ఏకంగా, పరిపూర్ణంగా ఎంచుకోవటమే నిజమైనటువంటి ఆధ్యాత్మికము. కనుకనే సర్వ జీవుల యందు ఉండినటువంటి ఏకత్వం ఒక్క ఆత్మనే. ఈ ఆత్మకు స్వరూపం ఏమిటి? ఈ ఆత్మకు స్వరూపం ఏవిధంగా తెలుపగలరు? విత్తనములో ఉన్నటువంటి చెట్టు యొక్క రసము ఏవిధంగా ఉంటుందో, అదేవిధముగనే ఈ ఆత్మ స్వరూపం కూడా ఉంటుంది. చక్కెరకు రూపం చెప్పవచ్చునుగాని, దాని తీపికి ఎవరు రూపం చెప్పగలరు? **తీపికి అనుభూతియే రూపము.** కనుక అనుభూతియే మూల కారణం. ఈ అనుభూతి సుషుప్తిలో ఏమాత్రం కనిపించదు.

ఈ పంచకోశముల ప్రమాణములు చాలా విచిత్రంగా ఉంటాయి ఒక్కొక్క కోశము ఒక్కొక్క రూపాన్ని ధరిస్తుంటుంది. కనుక వీటన్నింటినీ విచారిస్తూ కూర్చుంటే మనం గమ్యమును చేరుకోలేం. ఇది కేవలం **"నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్య శుద్ధ బుద్ధ ముక్త నిర్మల స్వరూపిణం"**. మనం దేహమును చూచినప్పుడు, దీనికి కేవలం పంచభూతములే కారణమనుకుంటాం. పంచభూతములుకాదు కారణం, పంచకోశములే కారణం ఈ పంచకోశములు కూడనూ దేహముతో తాదాత్మ్య భావన పొందటం చేత, ఇవన్నీ దేహము యొక్క ధర్మములని భావించుకుంటున్నాం. ఈ ధర్మములే ఆత్మయందు ప్రతిబింబిస్తున్నాయని భావిస్తున్నాం. ఆత్మయందు ప్రతిబింబించినదానికే **'ప్రాతిభాసికుడు'** అన్నారు. ఈ ప్రాతిభాసికుడు అనేటటువంటిది ఎక్కడ చూచినా మనకు కనిపిస్తూనే ఉంటుంది.

పారమార్థిక తత్త్వమనగా ఏమిటి? పరమతత్త్వమునకే పారమార్థికము అన్నారు. అనగా తురియావస్థలో కనిపించేటటువంటి ఆనందమే నిజమైనటువంటి పారమార్థికము. ఈనాడు చేసేటటువంటి సర్వకర్మలు కూడనూ కేవలం బాహ్య తృప్తికోసమే చేస్తున్నాము. ఇవన్నీ నవవిధములైన మార్గములుగా ఏర్పడినాయి. **"శ్రవణం, కీర్తనం, విష్ణుస్మరణం, పాదసేవనం, వందనం, అర్చనం, దాస్యం, స్నేహం, ఆత్మనివేదనం,"** ఈ నవవిధములైన మార్గములు కూడనూ ఒక్క ఆత్మ తత్త్వమునుండియే ఆవిర్భవించినటువంటివే. దీనికి ఆత్మనే మూలాధారము. లోకరీతిగా చూచినా మైసూర్‌పాక్, గులాబ్‌జాం - ఇవన్నీ ఎక్కడనుంచి వచ్చాయి? చక్కెర నుంచే వచ్చాయి. చక్కెర నుంచి అనేక రూపనామములు ధరించి, అనేక రకములైన రుచులుగా మనకు గోచరమవుతున్నాయి.

కాగడాలు గాని, కర్రజ్యోతులుగాని, ఎన్ని జ్యోతులైనప్పటికినీ, ఇవి సత్యనిత్యమైన శాంతిని చూపించవు. గాలి వీచిన తక్షణమే ఇవి ఆరిపోతాయి. గాలులకు పోనటువంటి జ్యోతి ఏమిటి. అదియే 'ప్రేమజ్యోతి'. ఈ ప్రేమజ్యోతి దేనికీ లొంగదు. ఈ ప్రేమజ్యోతి దేనికినీ ఆరిపోదు. ప్రేమకు ప్రేమ చేరినప్పుడు ప్లస్... ప్లస్ అవుతుంది. ఇంకా అధికంగా రూపొందుతుంది. కనుక ప్రతి మానవుడు ప్రేమమయుడు కావాలి. ప్రేమను ఒక్క దానిని మనం అభివృద్ధి పరచుకుంటే, ఈ విశ్వుడు, తేజస్సుడు, ప్రాజ్ఞుడు అనే బేధములే మనకు కనిపించవు. కర్మేంద్రియ, జ్ఞానేంద్రియములచేత సంతరించటం చేతనే ఇతను కేవలం 'విశ్వుడు' అని పేరు పెట్టుకున్నాడు. అన్ని కార్యములయందు సంచరించటంచేతనే ఇతనికి 'విశ్వుడు' అని పేరు పెట్టారు. అన్ని విధములైన వస్తువులపైన అభిమానం కలగటంచేతనే, ఇతనికి 'విశ్వుడు అని పేరు పెట్టారు. తేజోమయ సంబంధమైన అంతఃకరణతో కూడినవాడిని 'తేజస్సుడు' అని పేరు పెట్టారు. ఇతనినే వేదాంతం 'తైజస్సుడు' అంది. ఆనందమయకోశమే

ఎ.సి. రూములో తప్ప ఎక్కడా వుండని
వారంత షెడ్డుకు వచ్చిచేరె
సేవలందుటె తప్ప సేవించి ఎరుగని
వారంత 'స్కార్ఫు'తో వరుసజేరె
కుషను సీటులో తప్ప కూర్చోని వారంత
కుల్వంతు హాలులో కూడియుండె
కాలి నడకెరుగని కారులో తిరిగేటి
వారంత ఎండలో వేచియుండె
ఏమి మహిమలు చేస్తివో ఎవరికెరుక
మార్చుతున్నావు మనుషుల మనసులన్ని
భూతకాలానలేదులే భూమియందు
కలుగబోదులె రాబోవు కాలమందు

**- ఆదూరి శ్రీనివాసరావు, కావలి**

ప్రాజ్ఞము. అది నిరంతరమూ ఆనందంగా ఉంటుంది. ఆరనిదికాదు, మారునదికాదు, కూలునదికాదు, పెరుగునది కాదు. కనుక నిరంతరమూ ఆనందంగా వుండేవాడు 'ప్రాజ్ఞుడు'. ఇలాంటి పవిత్రమైన పేర్లు అనాదికాలము నుంచి వచ్చాయి. కాని ఈనాడు అట్టి పవిత్రమైన పేర్లకు అర్థములుకూడా తెలియటంలేదు. వీటిని పురస్కరించు కొనియే అమరసింహుడు అనేక శ్లోకములు వ్రాశాడు. భగవత్ తత్త్వాన్ని అనేకులు అనేక విధములుగా వర్ణిస్తూ వచ్చారు. ఒక్కొక్క పేరుకు అనేక పేర్లతో భగవంతుని వర్ణిస్తూ వచ్చారు. వాటి అర్థములను తెలుసుకోలేక అమరసింహుని 'నాస్తికుడు' అని నిందించారు. అతనిని అనేకరకములుగా హింసించారు. అతను వ్రాసిన గ్రంథము లను అగ్నిలో వేశారు. వారు వ్రాసినవాటికి అర్థములను తెలుసుకోలేక, మూలతత్త్వమును గుర్తించుకొనలేక ద్వేషిస్తూ వస్తున్నారు. ఆ గ్రంథములను అగ్నిలో వేసినప్పుడు శంకరులవారు పరుగెత్తుకొని వెళ్ళారు. అగ్నిలో నుండి అమరకోశమును మాత్రం తీసుకున్నారు. అది వేదముతో సమానమైనది. ఇది అందరిచేత ఆకర్షింపబడేది. మన్మధునివలె సర్వులనూ భ్రమింపజేస్తుంది. మాధుర్యాన్ని పురికొల్పుతుంది. ఇలాంటి పవిత్రమైన గ్రంధమును అగ్నిలో పడవేయటం ఎంత బుద్ధిహీనం అన్నారు శంకరులవారు. ఈ విధంగా వేదములను సరిగా అర్థం చేసుకొనలేక, శాస్త్రములను చక్కగా వివరించుకొనలేక బుద్ధిహీనులైపోతున్నారు. అజ్ఞానంలో మునిగి తమను తామే మరచిపోతున్నారు. మన ప్రాచీనులు పలికిన ప్రతి పలుకు మంత్రమయమే, వేదమయమే. వేదమంటే ప్రత్యేక స్వరూపంకాదు.

ఈనాడు 'శివరాత్రి'. ఎన్నో రాత్రులు మనం గడుపుకున్నాం. అయితే ఈనాడు 'శివరాత్రి' అని ప్రత్యేకంగా ఎందుకంటున్నాం? 'శివరాత్రి' అనగా మంగళకరమైన రాత్రి. కనుక ఈ మంగళకరమైన రాత్రిని, మంగళకరమైన నామంతోనే మనం గడుపుతూ రావాలి. కేవలం 'జాగరణ' చేయటం మాత్రమేకాదు. జాగరణఅని రాత్రంతా మేలుకుంటారు. దాని కోసం ఏమి చేస్తున్నారు? మూడు నాల్గు సినిమాలకు వెళ్ళటం వలన 'శివరాత్రి' అవుతుందా? పేకాటలాడినంత మాత్రాన 'జాగరణ' అవుతుందా? కాదు... కాదు.. దైవనామం చేతనే ఈ రాత్రి గడపాలి. ఇది అంతఃకరణ నుంచి ఆవిర్భవించాలి. కనుకనే దీనికి "Reflection of the inner being" అన్నారు. ఇలా హృదయం నుంచి ఆవిర్భవించినటువంటి నామమునకు 'శివతత్త్వము' అన్నారు. భగవంతునికి ఎన్నో పేర్లున్నాయి. సహస్రనామములున్నాయి. అన్నిటికైనా ప్రధానమైనటు వంటిది, ముఖ్యమైనటువంటిది. **'సత్, చిత్, ఆనందం'.** 'సత్' అనగా శాశ్వతము, 'చిత్' అనగా పరిపూర్ణము. ఈ రెండింటి యొక్క ఏకత్వమే 'ఆనందము'. సత్ = చక్కెర, చిత్ = నీరు. ఈ రెండింటిని కలిపినప్పుడు 'పానకము' తయారవుతుంది. ఇదియే ఆనందము. అంతేగాని చక్కెర, చక్కెరగా; నీరు నీరుగా విడివిడిగా ఉన్నప్పుడు ఆనందం ఎక్కడ నుంచి వస్తుంది? కనుక హృదయమునందు ఆవిర్భవించినటువంటి ప్రేమతత్త్వము, నోటి నుంచి పలికేటటువంటి దివ్యతత్త్వము రెండింటి ఏకత్వము యొక్క తత్త్వమే పవిత్రమైన దైవత్వము. మనం ఏదిచేసినప్పటికినీ హృదయపూర్వకంగా, ప్రేమతత్త్వంతో చేయాలి. **It is the source of Love. But not the force of Love.** అయితే ఈనాడు బలవంతంగా చేసినట్లు చేస్తున్నాం. ఇదికాదు. అరనిముషమైనా చేయి. హృదయపూర్వకంగా చేయి. **"గంగిగోవుపాలు గరిటెడైనను చాలు, కడివెడైనలేల ఖరము పాలు".** ఒక చిన్నమాట హృదయపూర్వకంగా పలికితేచాలు.

అన్నమయకోశము నుంచి ప్రాణమయకోశములో ప్రవేశించాలి. ప్రాణమయమంటే ఏమిటి? ఇదే Vibration. అదియే ప్రాణము యొక్క స్వరూపము. ఈ Vibration నుంచి మనోమయకోశమునకు వెళ్ళాలి. మనోమయకోశమంటే ఏమిటి? సర్వత్రా వ్యాపించినటు వంటి తత్త్వమే. **'మనోమూలం ఇదంజగత్'** మనసు అనేది లేకుండా ఏ ఒక్క చిన్నపని చేయలేము. ఒక క్షణం అమెరికాను గురించి చింతించుకుంటే ఈ మనసు అమెరికాకు వెళ్ళిపోతుంది. కనుక ఈ మనసు అనేది సర్వత్రా వ్యాపించి ఉన్నది. **మనిషికి మరణం వున్నదిగాని, మనసుకు లేదు.** ఎన్ని శరీరములెత్తినా ఆ మనసు అతని వెంట వస్తునే ఉంటుంది.

ఇక విజ్ఞానమయకోశము. ఈ విజ్ఞానమంటే ఏమిటి? సైన్స్ యొక్క తత్త్వముకాదు. ఇది పదార్థశాస్త్రముకాదు. పదార్థ శాస్త్రం లోపల ప్రతిబింబము (Reflection) అనేది ఉంటునే ఉంటుంది. ఇదియే 'ప్రాతిభాషికము' అన్నారు. ఇది ఏ విధంగా వెలుగుతుంటుంది? నేను కోపం వచ్చి

ఈ బల్లను గట్టిగా కొట్టాను నేను గట్టిగా బల్ల కొట్టాను అనుకుంటావుగాని బల్ల కూడా నిన్ను కొట్టింది. ఇది ప్రతి బింబము (Reflection) యొక్క తత్త్వమే ప్రాతిభాషికము యొక్క తత్త్వమే. చిత్రరూపము యొక్క ఆనందమే. ప్రతిదానికి Reaction, Resound, Reflection వుంటునే ఉంటుంది. కనుక మనం ప్రాతిభాషికములోనే జీవితమున్ను గడుపుతున్నాము. కాబట్టి అది విజ్ఞానము కానే కాదు. ఇది లౌకిక విజ్ఞానము. అయితే నిజమైన విజ్ఞానము ఏమిటి? దానినే Constant Integrated Awareness అన్నారు. అది మార్పు చెందనటువంటి ఆనందము. కనుక అట్టి ఆనందమును మనం పొందాలి. అది ఈ పొంచ భౌతికమైన పంచకోశములలో వుండేటటువంటి ఆనందం కాదు.

అన్నమయము, ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము అంతవరకే పోతున్నాం. కనుక అన్నమయ కోశము స్థూలము. ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ కోశములు మూడూ చేరినప్పుడు సూక్ష్మము. ఆనంద మయము కారణ స్వరూపము. తురియావస్థయే మహా కారణస్వరూపము. కాబట్టి ఆ మహాకారణంలో మనం ప్రవేశించాలి. కారణమునకు అతీతమైనటువంటిది మహాకారణము. ఇలాంటి తత్త్వమును మనం తెలుసు కోవాలనుకుంటే, పంచకోశముల యొక్క స్వరూపాన్ని చక్కగా ప్రత్యక్షంగావించుకోవాలి. కోశములన్ని దేహమును పట్టుకొని ఆడుతున్నాయేగాని, నిజంగా దేహమునకు, కోశములకు సంబంధంలేదు. అన్నమును చూచి ఆశించేది, ఆనందాన్ని చూచి పరవశించేది, పరిమళాన్ని చూచి పరిహసించేది అంతా ఆత్మతత్త్వమే. దాని ద్వారానే ఇవన్నీ ప్రతిబింబిస్తున్నాయి. కాని మనం ఆత్మవరకు ప్రవేశించ కుండా, దేహం వరకే ప్రవేశించి, ఇదంతా దేహం చేసే పనే అని భావిస్తున్నాం. దేహం కేవలం ఒక పనిముట్టు మాత్రమే. తురియావస్థలో మాత్రమే మనకు శాశ్వతమైన ఆనందం లభ్యమవుతుంది. మిగతావన్ని భౌతికమైన ఆనందములే. అవి తాత్కాలిక మైనవి. అవి శాశ్వతంకాదు. భగవంతుని నామాన్ని స్మరించండి. అది సర్వకాల సర్వావస్థలయందు సంరక్షిస్తుంది. మిగతావన్ని కదిలిపోయే మేఘాల వంటివే. ఆనందం ఒక్కటే శాశ్వతమైనది. పవిత్రమైన ప్రేమయే శాశ్వతం. కనుక Love is God, Live in Love. దీనిలో మనం జీవితాన్ని గడుపుతూ రావాలి. అప్పుడే సర్వకాల సర్వావస్థలయందు శివత్వాన్ని బోధించిన వారమవుతాం. దైవత్వం ఒక్కటే శాశ్వతం. అది ఒక్కటే శాశ్వతమైన ఆనందాన్ని అందించగలదు. ఇది మార్పు చెందేటటు వంటిది కాదు. అట్టి ఆనందమును అందించే టటువంటి దైవనామాన్ని మనం స్మరిస్తూ రావాలి.

ఈనాడు మనం ఈ వయస్సును వ్యర్థంగావించుకో కూడదు. ఇది చాలా పవిత్రమైనది. అనవసరమైన కార్యము లలో పాల్గొని అనేక చిక్కులకు గురి అవుతున్నారు మనస్సుకు శాంతిలేకుండా పోతున్నది. ఈ శాంతి మనకు ఎక్కడ లభిస్తుంది? ఇది ప్రపంచంలో ఎక్కడా మనకు చిక్కేటటువంటిదికాదు. ఆ శాంతి నీయందే ఉంటున్నది. కనుక మొట్టమొదట నిన్ను నీవు తెలుసుకో. అప్పుడే ఆనందం నీకు ప్రాప్తిస్తుంది.

ప్రేమస్వరూపులారా! మనం అనేక పండుగలు చేసుకుంటున్నాం. భారతీయుల పర్వదినములన్నియూ, ఎన్నియో పవిత్రమైన ఆనందాన్ని అందించేటటువంటివే. కాని వాటి అంతరార్థములను మనం గుర్తించుకోలేక పోతున్నాం. బాహ్యమైన చర్యలతోనే మనం తృప్తిపడుతున్నాం. ఈనాడు దైవత్వాన్ని విస్మరించి, లౌకికాన్ని విశ్వసించి అనేక కర్మలలో మనం పాల్గొంటున్నాం. అదియే మన యొక్క అజ్ఞానం. ఈ అజ్ఞానం ఏనాడు నిర్మూలనమవుతుందో, ఆనాడే జ్ఞానోదయం అవుతుంది. అందరినీ ప్రేమించండి. ఎవ్వరినీ ద్వేషించకండి. Help Ever, Hurt Never ఈ రెండూ చాలు. కనుక ఎవ్వరినీ నొప్పించకండి. బాధించకండి.

విద్యార్థులారా! మీ విద్యలయందు కూడా చక్కగా

## సుభాషితవాణి

"అస్థిరం జీవనం లోకే
అస్థిరం యౌవనం ధనమ్
అస్థిరం దారపుత్రాది
ధర్మః కీర్తిర్ద్వయం స్థిరమ్"

జీవితకాలము స్థిరమైనదికాదు. యౌవనం కూడా కొంతకాలమే ఉండేది. ధనం ఎప్పుడూ స్థిరం కాదు. భార్యా బిడ్డలు కూడా శాశ్వతంగా ఉండరు. లోకంలో స్థిరమైనవి రెండే రెండు. ధర్మము, కీర్తి - ఈ రెండే శాశ్వతముగా ఉండిపోవును.

ఉత్తీర్ణులవ్వండి. కేవలం లౌకిక విద్యలయందే కాదు. ఆత్మవిద్యయందు కూడా మీరు ఉత్తీర్ణులుకావాలి. విద్యలలోకెల్ల ఆత్మ విద్యయేమిన్న. అదియే బ్రహ్మవిద్య. అదియే బ్రహ్మజ్ఞానం. ఇంద్రియ నిగ్రహము ప్రతి ఒక్కరికీ ఉండాలి. ఇంద్రియాలను నిగ్రహించుకున్నప్పుడే యౌవ్వనత్వం ఉంటుంది. ఎప్పటికీ నీవు యువకుడిగానే ఉంటావు. దీనికి నేనే (స్వామి) మీకు ప్రమాణం. నాలో అన్ని శక్తులూ ఉంటున్నాయి. ఏ ఒక్కటీ బలహీనంగాలేదు. ఎవరైనా నాకు 75 సంవత్సరాలని చెప్పగలరా? దీనికి మూలకారణమేమిటి? Purity, Patience, perseverence ఈ మూడే మూలకారణం. Purity .. Purity . Purity . పవిత్రమైన, నిర్మలమైన, నిశ్చలమైన భావమే. ఇలాంటి భావములను పెట్టుకోండి. మేమంతా స్వామి భక్తులం... స్వామి భక్తులం... అంటారు. స్వామిలో ఉన్నటువంటి పవిత్రతలో వెయ్యింట ఒక భాగమైనా మీలో చేర్చుకో కూడదా? శాంతం ఉండాలి. ఎవరైనా, ఏదైనా అడిగితే, పోవయ్యా! పోవయ్యా! అని కసురుకుంటారు. ఒక్క చిన్నమాట కూడా శాంతంగా చెప్పలేరు. ఎన్ని వేల మంది వచ్చినా, శాంతంగా మాట్లాడుతూ, నేను ఎంత ప్రశాంతంగా ఉంటాను. నాకు కేవలం ఒక్కపని మాత్రమే కాదు. ఎన్నో పనులున్నాయి. నా యొక్క Job ఎవ్వరికీ చెప్పడానికి వీలుకాదు. ఏ Department అని కూడా చెప్పలేను సర్వ Departments నావే. నాకు విశ్రాంతేలేదు. అయినప్పటికీ నేను ఎప్పుడూ ఆనందంగానే ఉంటాను. Happiness lies in Union with God. అదియే నిజమైన ఆనందం. నిరంతరమూ ఆత్మస్వరూపుడు నా యందే ఉన్నాడు. నా వెంటనే, జంటనే, కంటనే ఉంటున్నాడని భావించుకుంటే దుఃఖం గాని, విచారంగాని ఎక్కడ నుంచి వస్తుంది? విచారం నా వద్దకు రానేరాదు. కారణం ఏమిటి? Purity నాలో ఉండటం చేతనే విచార దుఃఖములు నాదరికి చేరవు. దుర్గుణములు, దురాచారములు ఉన్నచోటికి అన్నీ వచ్చి చేరుతాయి.

" SEE NO EVIL SEE WHAT IS GOOD
HEAR NO EVIL HEAR WHAT IS GOOD
TALK NO EVIL TALK WHAT IS GOOD
DO NO EVIL DO WHAT IS GOOD
THINK NO EVIL THINK WHAT IS GOOD
THIS IS THE WAY TO GOD"

ఇంకా నీకు ఎందుకు చిక్కులు వస్తాయి? ఎందుకు బాధలు వస్తాయి? ఒకవేళ దుఃఖము వచ్చినప్పుడు It is good for me .. It is good for me .. అని తలంచు. ఏ కష్టములు వచ్చినా, విచారములు వచ్చినా అన్నీ నా మంచికే వచ్చాయని భావించుకో. నారాయణ అనే వ్యక్తి మద్రాసులో ఉంటాడు. ఆయన కుమారుడు మన విద్యాలయంలో చదువుతున్నాడు. నారాయణకు వారం రోజులు క్రిందట Heart లో Blood బ్లాక్ అయిపోయింది. అతని కుమారునికి తెలిసి, వెంటనే పుట్టపర్తి రమ్మనమని ఫోన్ చేశాడు. నారాయణ వచ్చాడు. మన హాస్పిటల్‌లో డాక్టర్లు పరీక్షించి మూడు వాల్వులు పూర్తిగా మూసుకొని పోయాయని, నాల్గవది కూడా కొంతవరకు మూసుకొని పోయిందని చెప్పారు. ఆపరేషన్ చేయడం కూడా చాలా కష్టమని చెప్పారు. అమెరికన్ డాక్టర్లు కూడా చూచి చాలా క్రిటికల్ అన్నారు. నారాయణగారూ! How are you? అని అడిగారు డాక్టర్లు. I am very Happy. Swamy is with me. కనుక నాకు ఏ బాధాలేదన్నాడు. డాక్టర్లు తృప్తి చెందలేదు. మొన్న డాక్టర్లు 5 గంటలసేపు ఆపరేషన్ చేశారు. మొన్న ఆపరేషన్ అయితే ఈపూట యిక్కడకు (సాయికుల్వంత్‌హాల్‌కు) వచ్చాడు. ఏ హాస్పిటల్‌లో అయినా సరే, కనీసం పది దినములు Bed పై ఉంటారు. నిన్నటి దినం లేచి కూర్చున్నాడు. డాక్టర్లు పెట్టిన ఇడ్లీ తిన్నాడు. నిన్న సాయంకాలం హాస్పిటల్‌లో మూడువందల అడుగులు నడిచాడు. ఈ పూట యిక్కడకు పాంటు, షర్టు వేసుకొని కాలేజీ కుర్రవాడిలా వచ్చాడు. చూచాను. చాలా ఆనందించాను. దీనికంతా మూలకారణం నీ విశ్వాసమే నన్నాను. వారివారి నమ్మకమే దానికి మూలకారణం. పుట్టపర్తి వచ్చినప్పటి నుంచి స్వామి నన్ను చూచుకుంటాడు. నన్ను ఎవరూ చూడనక్కరలేదనే వాడు. మొన్న ఆపరేషన్ జరిగింది. నిన్న ఇడ్లీ తిన్నాడు. ఈ పొద్దు మందిరానికి వచ్చాడు. దీనికి ఏ డాక్టరు అయినా సమాధానం చెప్పగలడా? ఎవ్వరూ చెప్పలేరు. భగవంతుడు **Nature ను కూడా Future గా మార్చగలడు.** కనుక భగవంతుని మీద సంపూర్ణమైన విశ్వాసం గనుక వుంటే అసాధ్యమనేది ఏదీలేదు. నమ్మకం ముఖ్యం. అయితే ఈనాడు మనిషి తనను తానే నమ్మటంలేదు. తన మీదనే నమ్మకం లేకుండా పోతున్నది.

"నమ్మకమను రెండు నయనంబులే లేని
అంధులైరి నేడు అవనియందు"

ఎవ్వరినీ నమ్మరు. తనను తానే నమ్మనివాడు ఇంక దైవాన్ని ఏ విధంగా నమ్మగలడు? తనను తాను తెలుసు కోలేనటువంటివాడు. తనయందున్న దైవత్వాన్ని ఏ విధంగా తెలుసుకోగలడు? మొట్టమొదట తనను తాను తెలుసు కుంటే దైవత్వం తేలికగా అర్థమవుతుంది. కనుక మొట్ట మొదట దైవత్వాన్ని విశ్వసించండి. దైవంచేత కానటువంటి పని లోకంలో ఏ ఒక్కటీ లేదు. అయితే ప్రతి హృదయం నమ్మకంతో పవిత్రతకు నిలయం కావాలి. కన్నులున్న వానికి చిన్న మిణుగురు పురుగు అయినా కనిపిస్తుంది. లేనివానికి సూర్యోదయమయినా కనిపించదు. అదేవిధము గనే ఆధ్యాత్మిక నేత్రములేనటువంటి వానికి అన్నీ చీకటిగానే ఉంటాయి. ఆధ్యాత్మిక వెలుతురు చిన్న అణుమాత్రమున్నా ప్రపంచమంతా చూడగలడు. దీనిని '**కలియుగము**' అన్నారు. కలియుగంకాదు. ఇది '**కలహాయుగము**'. ప్రతి దానికి జగడమే. ఇంట్లో, బయట ఎక్కడ చూచినా జగడాలే. ఈ అశాంతిని దూరం చేయాలి ఈనాటి విద్యార్థులు. ప్రేమతత్త్వం చేత అందరినీ కలపాలి. అసూయాద్వేషాలకు స్వస్తి పలకాలి. క్రోధాన్ని చంపివేయాలి. ప్రేమతత్త్వాన్ని పెంచాలి. ఏ మానవునియందు అసూయా ద్వేషములు మరియు క్రోధము ఉంటుందో, వాడి జీవితం వుండికూడా చచ్చిన వానితో సమానమే. దైవం పైననే క్రోధమును పెంచుకున్న హిరణ్యకశిపుడు, రావణాసురుడు, దుర్యోధ నాదులు ఏమైనారు? కట్టకడపటికి వారివారి వంశాలనే సర్వనాశనం గావించుకున్నారు. ప్రేమను పెంచుకున్న పాండవులు ఎన్ని కష్టములు వచ్చినా కట్టకడపటికి దైవానుగ్రహం వలన సంరక్షించబడ్డారు. కనుక భగవంతుని ప్రేమించండి. ప్రేమతత్త్వాన్ని పెంచుకోండి. ఎంత ప్రేమను పెంచుకుంటారో, అంత ఆనందానికి సమీపమవుతారు. క్రోధం పెరుగకూడదు. ద్వేషం అంతకన్నా పెరుగకూడదు. ప్రేమ పెరగాలి. ఎంత ప్రేమ పెరుగుతుందో మనిషి అంత సుఖాన్ని పొందుతాడు. ప్రేమను పెంచుకోవటమే ఈ శివరాత్రి యొక్క ప్రధాన లక్షణముగా భావించుకోండి. కనుక ప్రేమను పెంచుకోండి. రాత్రంతా ఆనందంగా భజన చేయండి. తరించండి.

(ది. 4-3-2000న ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)

విజ్ఞానవాణి - 1

## నిద్రిస్తుంటే ఎత్తు పెరుగుతామా?

**శ్రీ సి.వి. సర్వేశ్వరశర్మగారు అనుభవంగల సైంటిస్ట్. సామాన్యునికి సైన్సు చెప్పాలనేది ఆయన జీవిత లక్ష్యం. ఎన్నో సైన్సు పరిషత్ మహాసభలు మన రాష్ట్రంలో నిర్వహించి చదువుకున్నవారికి కూడా తెలియని విషయాలు ఎన్నో తెలియబరిచారు. అంతేకాదు 'సైన్స్‌ప్లాష్' అనే గ్రంథము ద్వారా ఆసక్తికరమైన అనేక సందేహాలకు సైన్సు సమాధానాలు యిచ్చారు. వారి అనుమతితో పై పుస్తకములోని కొన్ని విషయాలను శ్రీవాణి పాఠకులకు అందిస్తున్నాను. చదవండి! వాస్తవాలను తెలుసుకొని ఆనందించండి! - సం॥**

మనిషి వెన్నెముకలో 26 వెన్నుపూసలుంటాయి ఈ పూసల నడుమ 'కుదురు'గా ఉపయోగపడే నారవంటి కణజాలం ఉంటుంది. దీనిని పూసల నడుమగల 'డిస్క్'లంటారు. మనం నడిచే సమయంలోను, గెంతే సమయం లోను శరీరానికి కలిగే ఒదుపులను ఈ 'డిస్క్'లు గ్రహించి వాటి ప్రభావం శరీరం మొత్తానికి లేకుండా చేస్తాయి. అంటే ఇవి 'షాక్ అబ్జార్బర్స్'గా వినియోగ పడతాయన్న మాట.

పగలు ఈ డిస్క్‌లు దగ్గరకు నొక్కుకుపోవడం వల్ల మన ఎత్తు కొంత కోల్పోతాము. రాత్రి సమయంలో పడుకుని నిద్రించేటప్పుడు ఈ డిస్క్‌లు తమ తొలిస్థితిని పొందుతాయి. అందుకే ఉదయం నిద్రనుండి మనం లేచినప్పుడు గరిష్ఠ ఎత్తు ఉంటాం. అంతేకాదు పగలంతా శ్రమించి నిద్రకుపక్రమించేముందు మనం కనిష్ఠ ఎత్తు ఉంటాం. అంతేకాదు ఈ డిస్క్‌లు వయసుతోబాటు హరించుకు పోతాయి. మనిషికి 21 సంవత్సరాల వయస్సు వచ్చే సరికి గరిష్ఠ ఎత్తు ఉంటాడు. ఆ తరువాత ప్రతి 25 సం॥ల కాలానికి రెండున్నర సెంటీమీటర్ల ఎత్తు తగ్గిపోతాడు. అంటే 25 సంవత్సరాల వయసులో ఎత్తు 175 సెంటీమీటర్లు వుంటే 50 సంవత్సరాల వయసు వచ్చేసరికి ఎత్తు 172.5 సెంటీమీటర్లు, 75 సంవత్సరాలు వచ్చేసరికి 170 సెంటీమీటర్లు ఉంటుంది.

సి.వి. సర్వేశ్వర శర్మ



# అంతరంగ తరంగాలు

(స్వామితో ఇంటర్వ్యూలు-ఇన్నర్వ్యూలు)

శాంతి ప్రేమలు : ఒకసారి స్వామి మాకొక ప్రత్యేకమైన ఇంటర్వ్యూ ఇస్తూ ఎనామిల్‌తో చేసిన తన రూపము గల అందమైన ఒక బంగారు ఉంగరమును సృష్టించి నాకు ఇచ్చారు. మొదట దానిని నా కుడిచేతి ఉంగరం వ్రేలికి ("అనామిక"కు) తొడిగారు. కొన్ని క్షణాల తరువాత దానిని తానే తీసివేసి నా ఎడమచేతి ఉంగరంవ్రేలికి తొడిగారు. అలా చేస్తూ ఆయన, భగవంతుడు కుడి, ఎడమలకు అతీతుడని చెప్పారు. భారతదేశములో ఎడమచేతికి ఉంగరం పెట్టుకోవడం గురించి కొన్ని అపోహలున్నాయి. కాని, ఎడమ చేతి వ్రేలికి ఉంగరం పెట్టుకోవడంలో తప్పేమి లేదని బాబా చెప్పారు.

ఆ రోజు ఇంటర్వ్యూ గదిలో నేను పరమశాంతిధామమైన ప్రశాంతి నిలయములోని హిల్‌వ్యూ స్టేడియంలోగల శాంతి వేదికపై శాంతి స్వరూపులైన భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు స్వయంగా అధ్యక్షత వహిస్తూండగా అనేక దేశములన్నిటి నుండి వచ్చే సాయిశాంతిదూతలు ప్రపంచములో ఒక నూతన శాంతి యుగమునకు నాంది పలుకుతూ అంతర్జాతీయ శాంతి సంవత్సరమును జరుపుకుంటే బాగుంటుందని స్వామిని కోరాను. నా సూచనకు అనుగ్రహపూర్వకముగా స్వామి నావైపు చూచి చిరునవ్వు నవ్వారు!

శాంతి అనేది, ఎవరైతే దాని కొరకు చిత్తశుద్ధితో అన్వేషిస్తూ, శ్రమిస్తూ, కృషిచేస్తారో వారికి సర్వత్రా వ్యాపించిన ఒక దివ్యశక్తి గోచరిస్తుందని బాబా చెప్పారు. నిజం! దివ్యమైన శాంతి "శివం,శాంతం, అద్వైతం"గా సర్వే, సర్వత్రా వ్యాపించియుంటుంది. మంచితనము, శాంతి, అద్వైతము ఎల్లప్పుడు ఒకదానితో ఒకటి కలసే ఉంటాయి.

ఒక్కొక్కప్పుడు అరాచకము, దుఃఖము, బాధవంటి వ్యతిరేక పరిస్థితులనుండి కూడా సుఖశాంతులు ఉద్భవించడం కద్దు. అయితే, ఇవన్నీ ఒకదాని తరువాత ఒకటి వచ్చిపోయేవి. సుఖమనేది రెండు బాధల మధ్య ఉండే విరామ సమయము. కేవలం రాజకీయ చదరంగము వలనకాని, సైనికకూటముల ద్వారాగాని లేక అగ్రరాజ్యముల పెత్తనము వలనగాని శాంతి నెలకొనదని స్వామి ఉద్ఘాటించారు. ప్రతి ఒక్కరు తమలో అంతర్గతముగానున్న దివ్యత్వమును గుర్తించి వర్తించినప్పుడే ప్రపంచములో శాంతి నెలకొంటుంది. మానవుడు కేవలం అంతరిక్షమును పరిశోధించడంలోనే నిమగ్నుడు కాకుండా, తన దృష్టిని అంతర్ముఖము గావించి తనలోనే ఉన్న ప్రపంచమును పరిశోధించి అక్కడ పేరుకున్న దురాలోచనలు, కోరికలు అనే చెత్తను తొలగించాలని బాబా చెప్పారు.

ప్రపంచములో ఈనాడు సర్వత్రా వ్యాపించిన దారిద్ర్యము, హింస, మత కల్లోలములను గురించి ఈ సందర్భముగా నేను ప్రస్తావించినపుడు నిరంతర భగవన్నామస్మరణ, నామ సంకీర్తనల ద్వారా హృదయమును పరిశుద్ధము గావించుకుని, మనిషికి మనిషికి మధ్య ఉత్పన్నమయ్యే భేద భావములను దూరము చేసికోవలసిన అవసరం ఎంతైనా ఉన్నదని స్వామి ఉద్ఘాటించారు. అవసరంలో ఉన్నవారికి ప్రేమతో సేవ చేయ్యండి, అని ఆయన సలహా ఇచ్చారు. అధికారములో ఉన్న వ్యక్తులు, నాయకులు తమ స్వార్థమును వీడి త్యాగ భావమును అలవరచుకున్నప్పుడే ప్రపంచము ఈనాడు ఎదుర్కొంటున్న అనేక సమస్యలు పరిష్కారమవుతాయని స్వామి పదే పదే నొక్కి చెప్పారు.

## ఘండికోట వెంకట సుబ్బారావు

సుదీర్ఘముగా కొనసాగిన ఈ ఇంటర్వ్యూలో తరువాత, స్వామి పవిత్రమైన దివ్యప్రేమతత్త్వమునకు ప్రతీకయైన కృష్ణతత్త్వమును గురించి వివరంగా తెలియ జేశారు. ఈ దివ్యప్రేమతత్త్వములో ఆరు అంశములున్నాయి.

మొదటిది : భగవంతునియందు అర్పణ భావముతో సంతతిధారవలె ప్రవహించు ప్రేమవాహినిలో మునిగిపోయే రాధాతత్త్వము. ఆధ్యాత్మిక జీవితమునకు ఇది మూలాధారమైన స్తంభము.

రెండవది : బాహ్య సౌందర్యముతో శివుని వశము చేసుకోవడానికి ప్రయత్నించి విఫలమై, చివరకు తన శరీరమును కూడా శుష్కింపజేసుకునే తపస్సు ద్వారా పరమేశ్వరుని పొందడానికి ప్రయత్నం చేసిన పార్వతీదేవివలె భగవంతుని యందు పవిత్రమైన ప్రేమతో దేదీప్యమానమగు ఆత్మ సౌందర్యమును ప్రస్ఫుటించే పార్వతీతత్త్వము.

మూడవది : ఇది శ్రీకృష్ణునియందు యశోదాదేవికిగల చల్లని, మెత్తని, మృదువైన నవనీతము వంటి మాతృ ప్రేమ తత్త్వము. గోక్షీరమునుండి తీసిన వెన్న చాలా పుష్టికరమైనది, హాయినిచ్చేది. ఇది దేనితోను కలవదు. దేనికి కరుగదు. ఒక్కమాతృ ప్రేమకు తప్ప. స్వామి మాటలలో చెప్పాలంటే, శ్రీకృష్ణుడు అప్పట్లో "అంగుష్ఠ మాత్రుడు". అయితే ఆయన శరీర మంతా నవనీతమువంటి ప్రేమతో నిండిపోయింది. మన్ను తిన్న చిన్నికృష్ణుని నోటిలో విశ్వరూపమును సందర్శించిన తరువాత కూడా యశోదా మాత ఆయన యందు జన్మజన్మలవరకు తన మాతృ ప్రేమనే కొనసాగించింది.

నాలుగవది : తరువాతది, గోపికలు తమ జీవిత మంతా ఒక్క క్షణం కూడా విడువకుండా శ్రీకృష్ణుని యందు చూపిన అనన్య భక్తి. శ్రీకృష్ణుడు బాల్యలీలలు ముగించి గోకులం విడిచిపెట్టడంచేత, వారు ఆయనకు చాలాకాలం పాటు దూరమయ్యారు. ఆ వియోగముచేత వారి ప్రేమ మరింత అభివృద్ధిపొందింది.

ఐదవది : అదే విధంగా, మీరాబాయి గోవర్ధన పర్వతమును తన చిటికెన వ్రేలితో ఎత్తిన బాలకృష్ణుని గిరిధారిగా ప్రేమించి ఆరాధించింది. శ్రీ కృష్ణునియొక్క ఆ రూపముతో ఆమె పూర్తిగా తాదాత్మ్యము చెంది అందులో లీనమైంది.

ఆరవది : తరువాత స్వామి, పాండురంగనియందు భక్తి భావముతో తన్మయుడై తరచు ఒడలు మరచి హృదయాలను కదిల్చివేసే అభంగములను రచించి శ్రావ్యముగా గానము చేసిన భక్తతుకారాం గురించి చెప్పారు. భారత దేశమంటే భావ, రాగ, తాళముల సమ్మిళితమైన సుస్వరమునకు, వీటన్నింటికీ మించి భక్తిభావమునకు ప్రతీకయని ఈ సందర్భముగా స్వామి చెప్పారు.

మొత్తంమీద ఈ ఇంటర్వ్యూ కృష్ణభక్తికి సంబంధించిన తత్త్వమును, ఆ భక్తిభావమును వ్యక్తము చేసే వివిధ రీతులను గురించి శ్రోతలను పరవశులను చేసేటట్లు బోధించిన ఒక గొప్పవివరణ. అది ఒక దివ్యమైన అనుభూతి. ప్రస్తుత యుగమునకు సంబంధించిన ఒక అవతార పురుషుడు గతంలో ఉద్భవించిన భువనమోహనాకారుడైన మరొక గొప్ప అవతారపురుషుని యొక్క లీలలను, ఆయన యందు ప్రజలకుగల భక్తి తత్త్వమును గురించి వివరించడం నిజంగా జ్ఞానదీప్తిని కలిగించే ఒక గొప్ప అనుభూతి. ★

తెలుగుసేత : గరిమెళ్ళ కృష్ణమూర్తి

## మూగజీవి పరివేదన

'అచట బలిపీఠమనెడి దృశ్యమ్ము నాదు
కంటఁబడి గొంతు రుద్ధమై కలచివేయ
చావ సిద్ధముగానున్న జీవులపుడు
నరుని నిలఁదీసి మాటాడినట్టులయ్యె'

మానవ! మానవా, బలుల మానవ? నీమదికెట్టు లబ్బె? నీ
ప్రాణము నిల్పుకొంటకయి పక్షుల జంతువులన్ వధింతువా?
ప్రాణుల సృష్టిఁజేసి పరిపాలనఁ జేసెడి తల్లి దుర్గ? మా
ప్రాణముఁ దీసియిమ్మనెనె? రాక్షస కృత్యముకాదె చూడగన్

మాకును మీకు ప్రాణము సమానము కాదె వివేక దృష్టిచే
చీకును చింతలేనిగతి, చీమలకైనను హానియెంచకన్
మా కొనఁగూడినట్టి పథమందున మానవసేవఁ జేతుమే
చేకొనుమయ్య మా హృదయసీమల మైత్రిని చిత్తశుద్ధిగన్

తల్లిగ జన్మనిచ్చినది తండ్రిగ జీవులఁ బెంచు నామెయే
తల్లియు బిడ్డలన్ తినదు, తప్పదు పుత్రులయందు ప్రేమయున్
త్రుళ్లి పడంగనేల? మము దుర్గకు బోనముసేయనేల? నీ
యుల్లము కోర్కెతీరుటకు యూపములెత్తుట ధర్మమెట్టులా?

పసుపు కుంకుమ బొట్లు మానొసటఁ బెట్టి
వేపమండల మెడఁజుట్టి బిగియఁబట్టి
డప్పు చప్పుళ్లు చెవులను కప్పివేయ
కుత్తుకలఁగోయు రాక్షస వృత్తినీది

శాకాహారులఁగోరదేమి బలి? మాంసాహారులన్ కోరెనా?
మేకల్ గొఱ్ఱెల కుక్కుటంబులను తామే కోరి భక్షింపగా
సాకుల్ చల్లని తల్లిపై నిడుచు హింసాయత్త మత్తాత్ములై
పీకల్ కోయుట ధర్మమౌనె దనుజా! పీడింపడే కాలుడున్

- ద్విభాష్యం కామరాజు, చెంద్రేడ, తూ॥గో॥జిల్లా

# మానవత్వంలేని విజ్ఞానం మారణహోమానికి దారితీస్తుంది

ఈనాడు టెక్నాలజీ పెరుగుతున్నది. సాంకేతిక పరిజ్ఞానం అభివృద్ధి అవుతున్నది. కాని మానవత్వం మాత్రం పెరగటంలేదు. మానవత్వంలేని విజ్ఞానం మారణ హోమానికి దారి తీస్తుంది. వివేకం అసలే ఉండటంలేదు. విషయపరిశోధనకు 'విజ్ఞానం' ఎంత అవసరమో, పరిశోధనా ఫలితాలను వినియోగించడానికి 'వివేకం' అంత అవసరం. సైంటిస్టులలో ఉండవలసిన సహృదయం ఉండటంలేదు. సహృదయం లేని సాంకేతిక పరిజ్ఞానం సర్వనాశనానికి దారి తీస్తుంది. ఈనాడు శాస్త్రజ్ఞులు విచక్షణాజ్ఞానాన్ని కోల్పోతున్నారు. విచక్షణారహితమైన నైపుణ్యం (Skill) వినాశనానికి దోహదం చేస్తుంది. ఈనాడు మేధావులు చేయవలసినంత ఆలోచనలు చేయటంలేదు. ఆలోచనా రహితమైన మేధాశక్తి (Intellect) మానవకళ్యాణానికి ఉపయోగపడటం లేదు. ఈనాడు మేధాశక్తికి (Intellect), నైపుణ్యానికి (Skill) మధ్య సమతూకం (Ecological Balance) లేకపోవటంవలన నేడు ప్రపంచంలో తరచుగా ఉప్పెనలు, తుఫానులు, భూకంపాలు సంభవిస్తున్నాయి. ఈనాడు అనాలోచితంగా అడవులను నరకివేస్తున్నారు. విచక్షణారహితంగా ఖనిజ సంపద కోసం భూమిని లోతుగా త్రవ్వి తొర్రచేస్తున్నారు. సముద్రగర్భమునుండి కోట్లాది టన్నుల చేపలను వెలికి తీస్తున్నారు. తత్ఫలితంగా ప్రకృతి భీభత్సాలను తరుచుగా ఎదుర్కొనవలసివస్తున్నది.

ఈనాడు పరిశోధన (Research), పరిశీలన (Investigation)లయందు సమత్వం (Balance) లోపిస్తున్నది. ఒక్క శాస్త్రజన్యజ్ఞానం (Scientific Knowledge) మాత్రమే మానవ పురోభివృద్ధికి సరిపోదు. మానవతాదృష్టి కూడా సైంటిస్టులకు కావాలి. విచక్షణ కావాలి, వివేకం ఉండాలి. అప్పుడే శాస్త్రజ్ఞుల పరిశోధనలు మారణహోమానికి కాకుండా మానవ కళ్యాణానికి ఉపయోగ పడుతాయి. సైన్సు ఒక్కటే చాలదు. సైన్సుకు Spirituality (ఆధ్యాత్మికం) కూడా తోడైనప్పుడే సమగ్రమైన ప్రగతిని సాధించగలుగుతాము. అయితే ఈనాడు చాలామంది అధునాతనులకు ఆధ్యాత్మికం మాట వినగానే Ellergy వస్తున్నది. దూరదృష్టి లోపించటమే దీనికి కారణం? "Religion without Science is Lame, Science without spirituality is Blind" (సైన్సు లేని మతం కుంటిది, ఆధ్యాత్మికత లేని సైన్సు గ్రుడ్డిది) అని అన్నారు ప్రఖ్యాత తత్త్వవేత, సైంటిస్టు Einstein (ఐన్‌స్టీన్). కనుకనే Science and Spirituality are not Contradictory, But Complementry to Each Other (సైన్సు ఆధ్యాత్మికం పరస్పర విరుద్ధమైనవి కావు, ఒకదానికొకటి పూరకములు) అన్నారు ఒక ప్రముఖతత్త్వవేత్త, కనుక మనం దేనినీ చిన్నగా

**కొమరగిరి కృష్ణమోహనరావు**

చూడకూడదు. అందువలననే 'సృష్టిని పరిశీలించేవాడు **Scientist**, సృష్టికర్తను పరిశీలించేవాడు **Saint**, అన్నారు భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారు

అసలు సృష్టికర్తను పరిశీలిస్తే, సృష్టి అంతా బాగా అర్థమవుతుంది గదా! సైన్సు యొక్క పరిజ్ఞానం పరిమితం, ఆధ్యాత్మికం యొక్క పరిజ్ఞానం అనంతం. కనుక ఈ రెండింటిని మేళవించినప్పుడే సమగ్రమైన పరిజ్ఞానాన్ని పొందగలుగుతాము. కనుక సైంటిస్టులకు ముఖ్యంగా మానవత్వం, వివేకం, విచక్షణలు ఉండాలి. అప్పుడే వారి పరిశోధనలు మానవాళికి వరంగా తయారవుతాయి, మానవ కళ్యాణానికి ఉపయోగపడుతాయి. అవి లేనప్పుడు సైంటిస్టుల పరిశోధనలు మానవాళికి శాపంగా పరిణమిస్తాయి అని బందరు హిందూ హైస్కూల్‌లో ది. 28-2-2000న జరిగిన సైన్స్ సెమినార్‌లో శ్రీ 'కొమరగిరి' పేర్కొనినారు. ఈ సభకు జిల్లా విద్యాశాఖాధికారి శ్రీ బి. సుధాకర్ అధ్యక్షత వహించారు. ప్రముఖ సైంటిస్టు, లెక్చరర్ శ్రీ సి.వి.ఎస్. శర్మగారు ముఖ్యఅతిధిగా విచ్చేశారు. జిల్లా సైన్సు ఆఫీసర్ శ్రీ పి.జి. శర్మ జిల్లా సైన్సు సెంటర్ ఆధ్వర్యమున ఈ సదస్సును నిర్వహించారు.

# స్వదేశీ పెన్నుల తయారీకి శ్రీకారం చుట్టిన 'రత్నం'

మహాత్మాగాంధీ 1920వ దశకంలో ఆంధ్ర ప్రాంతంలో విస్తృతంగా పర్యటించారు. దాని ప్రభావం సమాజంలోని అన్ని వర్గాలపై పడింది. కొందరు తమ సర్వస్వాన్ని త్యాగం చేసి జైళ్లకు వెళ్లితే మరికొందరు మహాత్మాగాంధీ నినదించిన స్వదేశీ స్ఫూర్తితో స్వదేశీ ఆర్థిక సంస్థలను స్థాపించి దేశ సౌభాగ్యానికి తోడ్పడ్డారు. డా॥ పట్టాభి సీతారామయ్య గారు ఆంధ్రాబ్యాంకు, ఆంధ్రా ఇన్సూరెన్సు కంపెనీ వంటి సంస్థలను స్థాపించి రాష్ట్ర ఆర్థిక ప్రగతికి స్వదేశీ స్ఫూర్తి కలిగించారు. మరికొందరు స్వదేశీ పరిశ్రమలను ముఖ్యంగా లఘుపరిశ్రమలను స్థాపించారు.

ఆ రోజులలో రాసుకునేందుకు కాగితం, రాసేందుకు ఉపయోగించే పెన్నులు, సిరాలు, సామాన్య సైన్సు పరికరాలు, టెస్టు ట్యూబ్‌లు, సింపిల్ బ్యాలెన్సు వంటివి కూడా విదేశాలనుంచి దిగుమతి చేసుకోవలసిన దుస్థితిలో దేశం ఉండేది. ఇట్టి పరిస్థితులలో బందరులో అయ్యగారి రామమూర్తి గారు అనే సామాన్య ఉపాధ్యాయులు సైంటిఫిక్ పరికరాలను తయారు చేసే వర్కుషాప్‌ను ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీని స్థాపించి రాష్ట్ర పారిశ్రామికీకరణకు శ్రీకారం చుట్టారు.

ఆ రోజులలో ఫౌంటెన్ పెన్నులు, సిరాలు విదేశం నుంచి దిగుమతి అయ్యేవి. పార్కర్ పెన్ను అంటే శ్రీమంతులు వాడే ఖరీదయిన పెన్ను. సామాన్యులు బ్లాక్ బర్డు పెన్నులను వాడేవారు. సిరా అయితే పార్కర్ ఇంక్, స్వాన్ ఇంకులు దిగుమతి అయ్యేవి. వీటిని మనం తయారు చేసుకోలేమా అని కొందరు ఉత్సాహికులు ఆలోచనలు చేశారు. ఆ విధంగా ఆలోచన చేసిన వారిలో రాజమండ్రి వాస్తవ్యులయిన కోసూరి వెంకట రత్నంగారు ఒకరు. వారు తయారుచేసిన పెన్నులు నాణ్యతలో ఏ విదేశీ పెన్నులకు తీసిపోకుండా దేశఖ్యాతి గడించాయి. అనేక మంది దేశ నాయకులు ఈ పెన్నులనువాడుతూ తమ పూర్తి సంతృప్తిని ప్రకటించేవారు.

రత్నంగారు ఆనాటి విశాఖ పట్టణం జిల్లా ఆలమండ గ్రామంలో 1898లో ఒక విశ్వబ్రాహ్మణ కుటుంబంలో జన్మించారు. తండ్రి వీరబ్రహ్మం గారు. చిన్న వయసులోనే తండ్రిగారు మరణించారు. అందువలన తన సోదరి గారి అత్తవారి వూరు రాజమండ్రి సమీపంలోని కేశవరం గ్రామం చేరుకున్నారు. అక్కడ కుల వృత్తి అయిన బంగారు నగలు తయారు చేయడంలో ప్రావీణ్యం సంపాదించారు. వృత్తి ప్రావీణ్యంతో పాటు వ్యక్తిగత నిజాయితీలతో ఆయన చాలా డబ్బు సంపాదించారు. కారణాంతరాల వలన కేశవరం గ్రామం నుంచి రాజమండ్రి మకాం మార్చారు. తన వృత్తి వలన ఎందుకో ఆయనకు తృప్తి కలుగలేదు. ఏదో వినూత్నమైనదీ, దేశీయమైనదీ, ప్రజలకు తోడ్పడేదీ ఏదో చెయ్యాలన్న తపన ప్రారంభం అయ్యింది. 1920లో

**కంభి వాసుదేవరావు**

మద్రాసుకువెళ్ళి డైస్ ఎంగ్రేవింగ్‌లో శిక్షణపొందారు. 1921లో మహాత్మాగాంధీ రాజమండ్రి వచ్చినప్పుడు రత్నంగారు ఆయనను కలుసుకున్నారు. రత్నంగారి పనితనాన్ని గాంధీజీ ప్రశంసిస్తూ "మీలో అద్భుతమైన పనితనం ఉంది. జాతికి ఉపయోగపడే ఒక చక్కటి లఘు పరిశ్రమను స్థాపించండి" అని సలహా యిచ్చారు.

ఆ సలహా రత్నంగారి మీద కూడా బాగా పనిచేసింది. ఏ పరిశ్రమ స్థాపించాలా అన్న ఆలోచనలు చెలరేగాయి. అప్పుడు బందరులో ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీని స్థాపించిన అయ్యగారి రామమూర్తి గారు మార్గదర్శిగా కన్పించారు. అందరకూ ఉపయోగపడే ఫౌంటెన్ పెన్నులను దేశీయంగా తయారు చేస్తే బాగుంటుందని ఇద్దరూ అనుకున్నారు. ఆ రోజులలో మద్రాస్‌లో జయసంపత్కుమారశెట్టి అనే పెన్నుల వ్యాపారి ఉండేవారు. విదేశాలనుంచి దిగుమతి చేసుకున్న పెన్నులను ఆయన అమ్ముతూ ఉండేవారు. ఆయన సలహాలు సూచనలు గ్రహించి పెన్నుల నిర్మాణం, వాటిలోని మెళుకువలను గ్రహించారు. రాజమండ్రిలో కె.వి.రత్నం బ్రదర్సు అనే సంస్థను సోదరుడు సత్యనారాయణగారితో కలిసి నెలకొల్పారు. సత్యనారాయణగారి వ్యవహార దక్షత

రత్నంగారి పని నైపుణ్యాం ఒకదానికొకటి తోడ్పడ్డాయి. ఐతే వెంటనే ఫౌంటెన్ పెన్నులను తయారుచేయడానికి ఈ యిద్దరు సోదరులకు ధైర్యం చాలలేదు. అనేక లక్షల రూపాయల పెట్టుబడులతో, ఆధునిక యంత్రాలతో ఆకర్షణీయంగా తయారయి దిగుమతి అయ్యే పెన్నులతో - తాము పోటీపడి నెగ్గుకురాలేమని భయపడ్డారు. అందు వలన తొలి మెట్టుగా పెన్నుల రిపేరు పనులు చేపట్టి ప్రజల ఆదరణ పొందారు. ఆనాటి పెన్నులకు బంగారు పాళీలను అమర్చేవారు. ఇక ఆ పెన్నులకు ఎన్ని సంవత్సరాలయినా తిరుగు ఉండేది కాదు. 1932లో రాజమండ్రికి కృష్ణమాచారి గారు సబ్‌జడ్జిగా వచ్చారు. ఆయనకు బంగారు పాళి జతపరచిన పెన్నును రత్నంగారు బహుకరించారు. ఆ పెన్నును సబ్‌జడ్జిగారు ఎంతగానో మెచ్చుకుని చక్కని ప్రశంసాపత్రాన్ని ఇచ్చారు. దాదాపు అదేసమయంలో ఐ.పి.ఎస్ ఆఫీసర్ వి. రామకృష్ణగారు రత్నంగారి పనితనాన్ని మెచ్చుకుని పెన్నులు తయారు కావడానికి అవసరమైన ముడిసరుకు దిగుమతి చేసుకునే వెసులుబాటు కలిగించారు.

ఇలా జరుగుతూవుండగా రత్నంగారి కంపెనీలో మలుపు తిప్పిన ఒక సంఘటన జరిగింది. 1933లో ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుగారి షష్టిపూర్తి మహోత్సవాలు రాజమండ్రిలో వైభవంగా జరిగాయి. అప్పుడు పాలకేడీ గురుమూర్తిగారు రత్నంగారిని కలుసుకుని సుబ్బారావు గారికి విలువైన విశిష్టమైన కానుకను అందజేయవలసిందిగా అభ్యర్థించారు. అందుకు రత్నంగారు స్పందించి వెండి గొట్టం సూచి కాప్‌లను వెండితో తయారుచేసి దానికి బంగారు పాళీని అమర్చి యిచ్చారు. ఆ పెన్ను పనితనానికి సర్వత్రా ప్రశంసలు లభించాయి. ఈ శుభ సందర్భాన్ని పురస్కరించుకుని రత్నంగారు పూర్తి స్థాయిలో పెన్నుల తయారీ మొదలుపెట్టి రత్నం పెన్నుల మార్కెట్టు చేశారు. ఆనాడు విదేశాలనుంచి దిగుమతవుతున్న మేలిరకం పెన్నుల పోటీకి తట్టుకొని మార్కెట్టులోకి దూసుకు పోయింది.

1934లో అఖిల భారత గృహపరిశ్రమల సంఘా ధ్యక్షులు, మహాత్మాగాంధీ అనుచరుడు జె.సి. కుమారప్ప గారు రాజమండ్రికి వచ్చినప్పుడు ఆయన ద్వారా మహాత్మా గాంధీజీకి తాము తయారుచేసిన పెన్నును కానుకగా పంపారు. మహాత్మాగాంధీ ఆ పెన్ను పనితనాన్ని ప్రశంసిస్తూ వార్ధా నుండి ది. 16-7-35న స్వయంగా ఉత్తరం రాశారు. అది మార్కెట్టులో ఉన్న విదేశీ కలాలకు చక్కని ప్రత్యామ్నాయం అని ప్రశంసించారు.

మహాత్మాగాంధీ మాత్రమేకాక ఆనాటి ప్రముఖు లెందరో ఈ పెన్నులను వాడి తమ పూర్తి తృప్తిని ప్రకటించారు. జవహర్‌లాల్ నెహ్రూ, రాజేంద్రప్రసాద్, వి.వి. గిరి, విజయలక్ష్మి పండిట్ వంటి దేశప్రముఖులే కాక సోవియట్ రష్యా ప్రధాని బుల్గానినా కృశ్చేవ్ వంటివారు కూడా వున్నారు. ఆ రోజులలో రాజమండ్రికి ఎవరయినా ప్రముఖులు వస్తే రత్నంగారు తమ సంస్థ గుర్తుగా తమ పెన్నులను బహుకరించేవారు. ఆ రోజులలో రత్నం పెన్ను కానుకగా పొందడం అంటే గొప్ప సత్కారంగా భావించేవారు.

1933లో కుంభకోణంలో జరిగిన అఖిల భారత హస్తకళ ప్రదర్శనలో అదే ఏడాది జరిగిన కృష్ణా పుష్కరాల ప్రదర్శనలోనూ రత్నంగారికి స్వర్ణ పతకం లభించింది.

ఎలాగూ స్వదేశీ ఫౌంటెన్ పెన్నుల పరిశ్రమ ప్రస్తావన వచ్చింది కనుక స్వదేశీ సిరా పరిశ్రమ గురించి ప్రస్తావించు కుందాం. తెనాలి "నీల్‌కాల్" అనే పేరుతో ఒక స్వదేశీ సంస్థ సిరాను తయారుచేసింది. మహాత్మాగాంధీ ఈ

సిరాను ప్రశంసించారు. 1930 దశకంలో బందరు వాస్తవ్యులు కంచి వేణుగోపాలరావుగారు సెంచరీ ఇంక్ అన్న పేరుతో సిరాను తయారుచేసేవారు. ఈ సిరా నాణ్యత గురించి నాకు స్వయంగా తెలుసు. ఈ సిరాలో ఒక విధమైన మెరుపు ఉండేది. కాగితంపై ఇంకేదికాదు. ఎంత వడసినా సిరా పాకి అక్షరాలు చెదరిపోయేవికావు. ఐతే వేణుగోపాలరావు గారు తన 25వ యేటనే అకాల మృత్యువు పాలవడంతో అది ఆగిపోయింది.

కాలక్రమేణా ఫౌంటెన్ పెన్నుల తయారీ వాడకం పూర్తిగా అంతరించకపోయినా తగ్గిపోయింది. బాల్‌పాయింట్ పెన్నులు ఫౌంటెన్ పెన్నుల స్థానాన్ని ఆక్రమించాయి. కాలానుగుణమైన మార్పులు రత్నంగారి కుమారులు గుర్తించారు. రత్నంగారు దూరదృష్టితో ఇద్దరు కుమారులను జర్మనీకి పంపి బాల్‌పెన్ను పరిశ్రమలో శిక్షణను ఇప్పించారు. పెద్ద కుమారుడు మెకానికల్ ఇంజనీరు. ఇద్దరు కుమారులలో ఒకరు రత్నం పెన్‌వర్క్స్‌ను, మరొకరు రత్నం బాల్ పెన్ వర్క్స్ (హైదరాబాద్)ను సమర్ధవంతంగా నిర్వహించుకుంటున్నారు.

రత్నంగారికి ఆయుర్వేద వైద్యంలో కూడా మంచి ప్రావీణ్యం ఉంది. ఆయన సాహితీ ప్రియుడు. స్వయంగా రచయిత. భువనేశ్వరి పీఠ చరిత్ర మొదలైన గ్రంధాలను రాశారు. కానీ వాటిని ముద్రింపజేసుకోవాలన్న ఆసక్తి లేక పోవడం వలన ఆయన రచనలన్నీ దాదాపు అముద్రితాలుగా ఉండిపోయాయి.

రాజమండ్రిలో జరిగే ప్రతి సాంస్కృతిక సాహిత్య కార్యక్రమానికి రత్నంగారు వెన్నుదన్నుగా ఉండేవారు. వరదలు మొదలైన ప్రకృతి బీభత్సాలు వచ్చినప్పుడు బాధితులకు సహాయ సహకారాలను అందించడంలో ఎప్పుడూ ముందు ఉండేవారు. శిల్పకళాశిరోమణి, అద్భుత శిల్పకళాప్రవీణ, ఆయుర్వేదాచార్య, విద్యాభాస్కర వంటి బిరుదులు రత్నంగారిని అలంకరించాయి. #

**చందాదారులకు మనవి**

**చందా పంపేటప్పుడు తమది క్రొత్త చందా? లేక పాత చందా? వివరంగా తెలియపరచండి. పాతచందా అయితే చందా నెంబరు తెలియజేయండి. మనియార్డరు కూపన్ మీద తమ చిరునామాను వివరంగా వ్రాయండి. అశ్రద్ధ చేయకండి.**

# పదాల పందిరి - 26

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1 | | ■ | 2 | ■ | 3 | 4 |
| | ■ | 5 | | 6 | ■ | |
| 7 | | | ■ | 8 | | |
| ■ | ■ | | ■ | | ■ | ■ |
| 9 | | . | ■ | 10 | | 11 |
| | ■ | 12 | 13 | | ■ | |
| 14 | | ■ | | ■ | 15 | |

**ఆధారాలు**

**అడ్డం :**

1. డబ్బు
3. చైనాలోని ఒక బౌద్ధనగరం దలైలామాగారి పేరులో ఉంది
5. పెదవి
7. వసిష్ఠుని ఆవు, ఒకటీవీ సీరియల్
8. తెలుగు క్యారక్టర్ యాక్టర్ ఇంటిపేరు ఒక పెద్దకాయ
9. తడబడిన అన్నులు
10. సులభం కానిది
12. శ్రీరామపుత్రుడే తిరగబడితే?
14. సన్నని మంట
15. శ్రీమహావిష్ణువుతో శ్రీదేవిలేదా!

**నిలువు :**

1. .....లేనీ బ్రతుకొక నరకం అన్నాడొక కవి
2. స్టోరి
4. వేసవి సీజన్‌లో పండేకాయ
5. అర్జున సుతుడు
6. రంగీన్ సప్నా,
9. ఒక పిండివంట, బూరెలాంటిది
11. వీరిదే ఎంకి
13. తలక్రిందులైన మృత్యువు

**పదాలపందిరి - 25 సమాధానాలు :**

అడ్డం : 1) కసి 3) త్రోవ 5) చిరునామా 7) లివరు 8) నరుడు 9) జవాను 10) వీనులు 12) కరుణ 14) భారం 15) గీము

నిలువు : 1) కదలి 2) గోరు 3) వరుడు 4) చిరుకానుక 6) మానస వీణ 9) జనాభా 11) లుప్తము 13) రుచి

- కిరీటి

# మనిషి - మనసు

మనిషి-మనసు మూడక్షరాల పదాలు. ఈ రెండింటిలో మొదటి రెండక్షరాలు, మ,న-లు. మూడో అక్షరం ష-స.లు. పద్య ఛందస్సులో యతి స్థానమందు పరస్పరమైత్రి గలవి. ఈ రెండు పదాలకు అవినాభావ సంబంధం ఉంది.

మొదటిది దృగ్గోచరము. రెండోది అగోచరము. ఒకటి రూపసహితము. రెండోది రూపవిహితము. మనిషి సౌందర్యాన్ని చర్మ చక్షువులతో దర్శించగలము. మనసు సౌందర్యాన్ని మనోనేత్రాలతోనే సందర్శించగలము. మొదటిది అనుభవానందం. రెండోది భావానందం.

మనిషికి మనసు అంతర్నేత్రము. మనసుకు మనిషి బాహ్యచిత్రము. మనిషి మనసునే మార్చగలడు. మనసు మనిషినే మార్చగలదు. మనిషి మనసు కన్న మర్మమైనటు వంటి మాయలెన్నో చేయగలరు, కాని మనిషి మనసు తెలుపు మార్గమెక్కటైన యెప్పుడైనా, యెక్కడైనా, యెవరైనా చెప్పగలరాన్నది సందేహాస్పదమే!

మనసు మనిషికి యజమాని. మనిషి మనసుకు బానిస. యజమానికి బానిస లోకువ. ఆతని ఆదేశాలను ఆజ్ఞలను ఔదలదాల్చవలసిన అస్వతంత్రుడు. అయినా శక్తి సామర్థ్యాలతో బాధ్యాయుత స్వేచ్ఛాజీవనాన్ని సాధించుకోగల్గడం బానిసకు అసాధ్యమేమీకాదు. మనసు మాయా మృగం. పాదరసంలా చేతికి చిక్కకుండా జారిపోగలదు, పారిపోగలదు. అయినా మచ్చిక చేసి స్వాధీన పర్చుకోగలిగితేనే, మనిషి తన జీవిత ధర్మాన్ని నెరవేర్చుకో గల్గుతాడు. అసలు జీవిత ధర్మమంటే ఏమిటో తెలియాలిగా? అందుకే-ముందుగా మనిషి ఆ విషయంపైన మనసు పెట్టాలి! మనసు పెట్టనిదే మనిషికి ఏ విషయమూ అవగాహన కాదు. తానెవరు? తానెక్కడి నుంచి వచ్చాడు? ఎక్కడికి పోతాడు? ఈ నడుమ జీవితకాలంలో తను చేయాల్సిన పనులేమిటి? ఇత్యాది ప్రశ్నలు, సందేహాలు, మనసు పెట్టేనే ప్రతి మానవుడి జీవితంలోనూ ఏదో ఒక సమయంలో ఉద్భవిస్తాయి.

ఈ సందేహాల సమాధానాలకై కొంతమంది తమ జీవిత కాలమంతా అన్వేషిస్తూనే ఉంటారు! మరికొందరైతే అసలా ఊసే తలపరు! సాలెగూటిలో చిక్కుకొన్న ఈగ వలే, ఇంద్రియ ప్రలోభాల ప్రభావాలలో మనసు చిక్కుకొని అనుక్షణమూ అలాంటివారిని వేధిస్తూనే ఉంటుంది? తన్నివారణకోసమే, మానసిక నిగ్రహశక్తిని సాధించు కోగలగాలి! అందుకనువైన మార్గము ధ్యానమొక్కటే!

మంచి-చెడు, మిత్రత్వ-శత్రుత్వ వంటివన్నీ మనసులోనే ఉంటాయి. పాపపుణ్యాలు, సుఖదుఃఖాలు - యివన్నీ మనిషి ఊహాజనితాలే! మనసు మెచ్చే మనసుకు నచ్చే లౌకికానందంపై మనసుపడి, మనిషి మనసును పాడుచేసుకోరాదు. అలౌకికానందాన్నందు కొనేందుకే మనిషి మనసు ఆరాటపడాలి! ప్రతి మనిషిలోనూ అపారశక్తి సంపద

## సోమంచి రామం

నిబిడీకృతమై ఉంటుంది. భూగర్భమందు నిక్షిప్తమైయుండు ఖనిజ సంపదను శాస్త్రవిజ్ఞానముతో వెలికి తీయునట్లు, మనిషిలోని అంతర్గత శక్తిని, మానసికధ్యానశక్తితో వెలికి తీయాలి! అప్పుడే వర్ణనకలవికాని చిత్తశాంతి మనిషికి లభించగలదు. బోధనవలనగాక, సాధనవలననే ఈ ధ్యానశక్తిని తద్వారా మనోనిగ్రహశక్తిని సాధించాలి!

మనసు మనిషికి బద్ధశత్రువు. మచ్చిక చేస్తే ప్రాణ మిత్రుడు. అందుకే ధ్యానసాధన ప్రాథమికదశలో, మనసు వికలమై చికాకు పడిపోయి, ఎదురు తిరుగుతుంది. తదుపరి ఆ చికాకులోనే, మనసు ఒక విషయమునుంచి, మరో విషయానికి గెంతుతూంటుంది. ఆ తరువాత కొంత మొద్దుబారి, బండబారిపోతుంది, అప్పుడు ఏదో ఒక విషయము పైనే లగ్నమైపోతుంది, ఆఖరి దశలో మనసు సంపూర్ణ స్వాధీనంలోకి వస్తుంది. ఆవిధంగా పరిపూర్ణత్వం పై మనసును స్థిరపర్చుకోవడమే జీవిత లక్ష్యము. అవిశ్రాంత స్థితినుండి, అమరత్వాన్ని పొందేందుకై, భువినుండి దివికి చేర్చే సోపానమే ధ్యానము. అట్టి ధ్యానము వలన పొందే అమర సౌఖ్యము ముందు, యావత్ప్రాపంచిక సుఖ సము దాయములన్నియు తీసికట్టే! 

# ఏకనాథ మహరాజ్

ఒకప్పుడు ప్రతిష్ఠానపురంగా పేరొందిన పైఠాన్ (మహారాష్ట్ర)లో చాలా ఏళ్ళకింద ఒక పేద బ్రాహ్మణుడు ఉండేవాడు. ఆయన తనకే ప్రాణి ఎదురయినా సాష్టాంగ నమస్కారం చేసేవాడు. ఎందుకంటే, ఆయనకు అందరిలోనూ భగవంతుడే కన్పించేవాడు. అందరికీ దండాలు పెట్టేవాడని ఆయనను అంతా దండాల స్వామి అంటుండేవాళ్ళు.

ఒకరోజు ఆయన ఎటో వెళ్ళివస్తుంటే దారిలో చచ్చిపడున్న ఒక గాడిద కనిపించింది. ఆయన దానిపై జాలిపడి తన శక్తితో దానిని బ్రతికించాడు. ఇది గ్రామంలో రకరకాల చర్చలకు దారి తీసింది. ఆయన గురువుకు కూడా ఆయన చేసిన పని నచ్చలేదు. అందుకని ఆయన తన శిష్యుని సజీవసమాధి తీసుకొనవలసిందిగా ఆదేశించారు. అతడు వెంటనే పద్మాసనం వేసికొని, యోగమార్గంలో తన ప్రాణాలను వదిలేశాడు.

దాంతో గ్రామ పెద్దలు ఆ బ్రహ్మహత్యాపాతకం అలాంటి ఆదేశమిచ్చిన గురువుదేనని తేల్చారు. ఆయన శిక్షనైనా స్వీకరించాలి లేదా తన పవిత్రతను నిరూపించుకోవాలి - అని వాళ్ళన్నారు. పవిత్రత నిరూపించుకోవడానికై ఆయన గుడిలోని నంది విగ్రహంతో గడ్డిని తినిపించాలి. ఆ గురువు గుడిలోనికి వెళ్ళి అందరూ చూస్తుండగా ఒక చేయి నందిపై వేసి మరో చేత్తో గడ్డిని నంది ముందు పెట్టాడు. 'స్వామీ! మీరు నా శిష్యుని వలన ఒక గాడిదకు ప్రాణ దానం చేశారు. ఆ పుణ్యఫలితంగా ఈ గడ్డిని తిని ఈ గ్రామ పెద్దల కోర్కె తీర్చండి' అని ప్రార్థించాడు. నంది నాలుకజాపి ఆ గడ్డిని అందుకొని ఆరగించింది. ఈ రోజున కూడా పైఠాన్‌లో దండాల స్వామి (మరాఠీలో 'దండవతే స్వామి) సమాధినీ, రాతి నంది విగ్రహాన్నీ చూడవచ్చు.

అలా నందితో గడ్డి తినిపించిన గురువు ఏకనాథ మహరాజ్. ఆయన 1450లో పైఠాన్‌లో జన్మించారు. తండ్రి సూర్యనారాయణ, తల్లి రుక్మిణీబాయి. చిన్నతనంలోనే తల్లిదండ్రులు గతించడంవల్ల తాతగారి పెంపకంలో పెరిగి, 12 ఏళ్ళకే అన్ని విద్యలలో పాండిత్యం సంపాదించారు. ఏకనాథునికి ఒకరోజు దేవగిరి వెళ్ళి అక్కడ జనార్ధన స్వామి వద్ద మంత్రోపదేశం పొందవలసిందని ప్రేరణ కలిగింది. వెంటనే ఆయన దేవగిరికి వెళ్ళి జనార్ధన స్వామికి శిష్యుడుగా చేరారు. ఏకనాథుని భక్తిశ్రద్ధలకు ముగ్ధుడై, జనార్ధనస్వామి ఆయనకు ప్రత్యక్షంగా దత్తాత్రేయులవారి దర్శనం చేయించారు.

గురువు ఆదేశంపై ఆయన జాబాయిని వివాహం చేసుకున్నారు. ఆయన యిల్లెప్పుడూ అతిథి అభ్యాగతులతో కళకళలాడుతూ వుండేది. ఇల్లెలాగడిచేదో ఏకనాథునికి

**భండారు పర్వతాలరావు**

పట్టేదికాదు. కాని ఏ లోటూ వచ్చేదికాదు. ఏకనాథుడు నాటకీయంగా కీర్తనలను గానం చేసే పద్ధతికీ, కీర్తనలు పాడుతూ భజనచేసే పద్ధతికీ శ్రీకారం చుట్టాడు. మరాఠీలోనూ, ప్రాకృతంలోనూ ఆయన కొన్ని వేల అభంగాలను రచించారు. భాగవతాన్ని పురాణం చెప్పేవారు. ఆయన రచించిన కీర్తనలు, అభంగాలు, గోపికాగీతాలు, పదాలు అన్నీ 'భజని భారూజ్' అనే పేరుతో ఇప్పుడు బాగా ప్రచారం చెందాయి.

ఏకనాథుని రచనలలో ఏకనాథ భాగవతం ముఖ్యమైంది. ఇంకా రుక్మిణీ స్వయంవరం, భావార్థ రామాయణం, చతుశ్లోకి భాగవతానికి ప్రాకృత భాషలో వ్యాఖ్య, హస్తామలక టీకా, శుకాష్టకానికి టీకా, స్వాత్మబోధ, చిరంజీవ పదం, ఆనందలహరి, అనుభవానందం, ముద్రా విలాసం, లఘుగీత మొదలైన గ్రంధాలను రచించారు. ఏకనాథుని బిడ్డ గోదావరికే ప్రసిద్ధకవి ముక్తేశ్వర్ జన్మించారు. రెండవ అమ్మాయి గంగ. కుమారుడు హరి. గొప్ప విద్వాంసుడు. ఏకనాథుడు 1521లో కృష్ణభజన చేస్తూ గోదావరిలో స్నానంచేస్తూ పరమానందంతో తన దేహాన్ని వదిలారు. ఏకనాథుని పూజలందుకొన్న కృష్ణ విగ్రహాన్నీ, ఆయన గృహాన్నీ, ఆయన సమాధినీ, పైఠాన్ వెళ్ళి ఏటా ఎందరో భక్తులు దర్శిస్తుంటారు. ☩







# ఆత్మలింగోద్భవం

శ్రీప్రశాంతి కాంతి తల్పశాయినే నమశ్శివాయ
సర్వదేవ పూజితాతి శాయినే నమశ్శివాయ
శాంతి దాంతి కాంతి పుణ్యదాయినే నమశ్శివాయ
ఓం జయోస్తు నిత్య సత్యసాయినే నమోనమోస్తు

మంగళకరమైన శివరాత్రి పవిత్ర క్షణాలు వస్తున్నాయి. క్షణం క్షణం శివంకర శుభవీక్షణాలు వ్యాపిస్తున్నాయి. పుణ్య లక్షణాలు ప్రకృతి సుందరిపై ప్రతిబింబిస్తున్నాయి. చంద్రుడిలోని పదిహేను కళలు సూర్యుడిలో లీనమై పోతున్నాయి. 'లీయతే ఇతిలింగమ్' ప్రకృతిలో లీనమైనది లింగం. సర్వప్రకృతిని తనలో లీనం చేసుకొనేది శివలింగం.

కళలు గ్రహిస్తున్న బాలభాస్కరుడు భారత జనయిత్రి అరుణారుణ పాదపద్మాలను తన లేతబంగారు కిరణకాంతి కరాలుసాచి తాకి ముద్దుపెట్టుకొంటున్నాడు. ప్రశాంతి గిరిశిఖర కాంతి తరంగాలు ప్రజల హృదయాంతరంగాలను మేలుకొల్పుతున్నాయి. సూర్యచంద్ర సమ్మేళనం. పవిత్ర ప్రశాంతి నిలయంలో అఖండ దీపం వెలిగించాడు శ్రీశ్రీ భగవాన్ సత్యసాయి శంకరుడు. కృపాకరుడు, దయా మయుడు, మహాదేవుడు, మహామహోపన్యాసాలు చేయిస్తున్నాడు, చేస్తున్నారు. విద్యార్థులు వివిధ వాద్య సమ్మేళనంలో శంకరస్తోత్రాలు చేస్తున్నారు.

జయ! జయ! సాయిదేవ! నవశారద నారద గాన సాహితీ ప్రియ! సకలాగమార్చితవరేణ్య! ప్రశాంతి వరప్రదాయకా! నయన సరోజ భాస్కర! సనాతన నూతన సత్యసారథీ!...

అంటూ స్తోత్రపాఠాలు మారుమ్రోగుతున్నాయి. అఖండ భజన సాగుతోంది.ప్రచండ తాండవం చేస్తున్నాడు నందీశ్వరుడు. శృంగీ భృంగీ వీణావాద్యాలు మృదంగనాదాలు సంగీత శాస్త్రక్రమంగా సహకార వాద్యాలు అందిస్తున్నారు.

"ఎవరయ్యా! పుట్టపర్తిలో సురలు మోహింపంగ దివ్యాగ మో
త్సవముల్ సేయుచు భక్తవర్యులకు నుత్సాహంబుగా మానసో
ద్భవలింగంబులు తీసియిత్తురట సంభావింపగా సూర్యుడా!
శివుడా! మాధవుడా! సరోజభవుడా! శేషాచలాధీశుడా!"

అని అనిమేషులు రెప్పవాల్చకుండా పుట్టపర్తివైపు చూస్తున్నారు. దేవేంద్రుడయితే ఒళ్ళంతా కళ్ళుచేసుకొని మరీ చూస్తున్నాడు. కాశీవిశాలాక్షి విశాలమైన కళ్ళు ఇంకా పెద్దవి చేసుకొని పరమేశ్వర పరిసరాలను పరిపరివిధాల పర్యవేక్షణ చేస్తోంది. ఆ పతివ్రతామతల్లి సర్వమంగళ తన మంగళ సూత్రాలను మదిలో నమ్ముకొని ఒకసారికి పది సార్లు కళ్ళకద్దుకొని మరల తన పైటకొంగులో దాచి పెట్టు కొంటోంది.

ప్రశాంతి నిలయం జగత్ కళ్యాణకాంతి వలయాలలో మరీ మెరిసిపోతోంది. ముక్కోటి దేవతాకాంతలు మెల్లగా

**'శాంతిశ్రీ' జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

చల్లచల్లగా విద్యుత్కాంతి దీపాల రూపంలో వివిధ విలాస విన్యాసభంగిమలలో బారులు బారులుతీర్చి వచ్చి నిలిచి పోయి సాయీశ్వర లీలావైభవాలను కన్నులు కరువుదీరా కనుగొంటున్నారు.

"శివ! శివ! పార్వతీశ! శశిశేఖర! శంకర! సర్వలోక బాం
ధవ! భవనాశ! లింగ! జనతా హృదయాంతర వర్తి పర్తి సం
భవ! నవనాయకా! ఘనవిభాకర! పర్తిపురీశ! దీన మా
నవ వరదాయకా! దురితనా శశిపాయ నమోనమోనమో"

అని భక్తులు భజనలు చేస్తున్నారు. ఉత్తేజకరంగా కడుకమనీయంగా అతిశ్రావ్యంగా ధ్వనితరంగాలు సాగి పోతున్నాయి. ఈ భజనలకు అనుగుణంగా సాయి శంకరుడు తల ఊపుతున్నాడు. ధూర్జటి ఈ రోజు పర్వతో పక్షాలు ఉవ్వెత్తుగా ఎగురుతున్నాయి. అవి యమునా తరంగాలై లయబద్ధంగా లాస్యం చేస్తున్నాయి.

"ఆత్మోద్భవ శివలింగా!
ఆత్మానంద ప్రదాత! ఆత్మారామా!
ఆత్మస్వరూప! సాయి మ
హాత్మా! పరమాత్మ! దేవ! ఆత్మజ్యోతీ"

## విదురనీతి

"దశధర్మం న జానన్తి
ధృతరాష్ట్ర నిబోధతాన్
మత్తః ప్రమత్త ఉన్మత్తః
శ్రాన్తః క్రుద్ధో బుభుక్షితః"
"త్వర మాణశ్చ లుబ్ధశ్చ
భీతః కామీచతేదశ
తస్మాదేతేషు సర్వేషు
న ప్రసజ్జేత పండితః"

ఓ ధృతరాష్ట్రా! మత్తులో ఉన్నవాడు, జాగ్రత్త లేనివాడు, పిచ్చివాడు, అలసియున్నవాడు, కోపము నందున్నవాడు, ఆకలిగొన్నవాడు, తొందరలోనున్న వాడు, లోభి, భయపడువాడు, కాముకుడు- ఈ పదిమంది ధర్మమును తెలుసుకొనలేరు. కావున, పండితుడైనవాడు వీరి సాంగత్యమును పరిహరించవలెను.

అని తత్త్వజ్ఞులు స్తోత్రాలు సాగిస్తున్నారు.

ప్రేమకావాలి. అన్నిటికీ ప్రేమ అవసరం. ప్రేమలేని వాడు నడపీనుగే సుమా! ప్రేమవల్ల అన్నీ కలుగుతాయి. దేశాన్ని ప్రేమించాలి. కన్న తల్లిదండ్రులదే మన హెడ్డూ, దుడ్డూ, బ్లెడ్డూ. "జననీ జన్మ భూమిశ్చ....". జన్మభూమిని జన్మనిచ్చిన జననిని సేవించాలి. స్వార్థం స్వప్రయోజనంతో ఎక్కువమంది జీవనం వ్యర్థం చేసుకొంటున్నారు.

దేవుడెక్కడోలేడు. ప్రతి మానవుడూ మాధవుడే. అందరినీ సేవించాలి. ప్రేమించాలి.

ప్రేమస్వరూపులారా! ఈ విధంగా ప్రతి శివరాత్రికి నా మానస కైలాసం నుండి పవిత్ర శివలింగాలు రూపుదాల్చి వస్తుంటాయి. ప్రజలు కేవలం దర్శనాభిలాషతో వచ్చి ప్రమాదాలలో చిక్కుకొంటున్నారని అంతరాలయంలో తీసి యథాస్థానాలకు పంపుతుంటాను. చాలా సంవత్సరాల తరువాత భక్తానుగ్రహం కొరకు మరల బయటకు చూపిస్తున్నాను.

నాలో ఎన్నో లింగాలున్నాయి. ప్రేమ ముఖ్యం. ప్రేమ ఉంటే అన్నీ సాధింపవచ్చు. ప్రేమతో ఉండండి అని బోధిస్తుండగా-

**ఓం నిధనపతయే నమః ఓం నిధనపతాంతికాయ నమః**
**ఓం ఊర్ధ్వాయ నమః ఓం ఊర్ధ్వలింగాయ నమః**
ఓం హిరణ్యాయ నమః ఓం హిరణ్యలింగాయ నమః
ఓం సువర్ణాయ నమః ఓం సువర్ణలింగాయ నమః
ఓం దివ్యాయ నమః ఓం దివ్యలింగాయ నమః
ఓం భవాయ నమః ఓం భవలింగాయ నమః
ఓం శర్వాయ నమః ఓం శర్వలింగాయ నమః
ఓం శివాయ నమః ఓం శివలింగాయ నమః
ఓం జ్వలాయ నమః ఓం జ్వలలింగాయ నమః
ఓం ఆత్మాయ నమః ఓం ఆత్మలింగాయ నమః
ఓం పరమాయ నమః ఓం పరమ లింగాయ నమః

అని అర్చనలు సాగుతున్నాయి.

1. నటరాజా నటరాజా నర్తన సుందర నటరాజ
శివరాజ శివరాజా..............
2. నమశ్శివాయా! నమశ్శివాయ
హరి ఓం నమ శివాయ శివ శివ శంకరసాయీశ్వరాయ
నమః ఓం
3. శివశివ సుందర హరసుందర
హరపరమేశ్వర!
4. శంభో! శివా! శంకరా!
గంగాధరాహరా గౌరీ శివా!
5. హరహరమహదేవ కైలాసవాసా
జగదీశ పరమేశ సాయీప్రభో
6. శంభో మురారే శంకరమురారే
ఓం సురహర ఫణిధర శంకర మురారే
7. శంకర శంకర నామ భజో!
శంకర శంకర నామ భజో!
8. పీతాంబరధర సాయీశంకర
చంద్రకళాధర గౌరిమనోహర
9. శివాయ నమశ్శివ శివాయ నమశ్శివ
శివాయ నమశ్శివ శివాయ నమ ఓం నమశ్శివాయ
10. ప్రేమముదిత మనసే కహో!

అని భజనలు సాగుతున్నాయి. షిర్డిలో ఆటలాడుతూ సాయి శివలింగాన్ని గోలీకాయ అని మింగి లేదుపో అన్నాడు. ఆ శివలింగ పూజా తత్పరులు వచ్చి అడిగితే అదా లేదు చూడుఅని నోరుతెరచి వట్టినోరు చూపాడు. ఆ నోటిలో అక్కడివారు బ్రహ్మాండగోళాన్ని తిలకించి ఆశ్చర్యపోయారు యశోదవలె.

నేడు సత్యసాయీశ్వరుడు ఆ అవతారంలో మ్రింగిన గోలీకాయలన్నీ శివలింగాలుగా చూపసాగుతున్నాడు. ప్రతి శివరాత్రికి ఆత్మోద్భవలింగాలు స్వామికి ఆత్మ నుండి వస్తుండడం సహజమే. యోగ్యతగల భక్తులకి చూపిస్తుంటాడు. లేదా యధాస్థానాలకు పంపుతుంటాడు.

"ఎన్నిరకముల లింగాలొ మున్ను వచ్చె
అరుదుగ హిరణ్యలింగమ్ము మరల వచ్చె
పుట్టపర్తీశ్వరుని పొట్టపొట్టకాదు
పుట్టులింగాల తేగల పుట్టయేమొ"

"బాలకృష్ణుడు మట్టి గోలీలు మ్రింగి
విశ్వగోళాలు స్త్రీకి చూపించినాడు
ఆ మహాగోళ పంక్తులన్ స్వామి నేడు
వివిధ లింగాలు చేసి చూపించుచుండె."

4 మార్చి శివరాత్రి పర్వదినోత్సవం. సమయం రాత్రి గం॥7-00లయింది. సత్యశివసుందర స్వామి ప్రశాంతి నిలయంలో భక్తులను కలయజూచారు. చిరునవ్వులు చిందించారు. భక్తుల హృదయకమలాలు విచ్చుకొన్నాయి. నవరత్న సింహాసనంపై స్వామి ఆసీనులయినారు. విశ్వ విరాట్పురుషుడైనాడు. విశ్వంవినుతింప సాగింది. వేదాలు ఘోషించాయి. దేవతలు చూస్తున్నారు. ప్రజా సమూహాలు భజిస్తున్నాయి. ఆకాశం హర్షించింది. ప్రకృతి స్వామిని సేవించ సాగింది. పంచభూతాలు పరమేశ్వరుణ్ణి ప్రతీక్షిస్తూ సేవించసాగాయి. పరంధాముడి గరుడాళ్వారులు ప్రశాంతి చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నాయి. మయబ్రహ్మలు అక్కడ స్వామి చేతిక్రింద వంగివంగి దాగిదాగి పనిచేస్తున్నాయి. ఎప్పుడే సృష్టి చేయమందురోయని దేవగణంబు నిర్గుణ రూపంలో అణువణువున స్వామి సేవలో నిమగ్నమై యున్నాయి. మహోపన్యాసం కొనసాగింది. సింహాసనంలో కూర్చొని స్వామి గంగాదేవిని పిలిచాడు. ఆమె వచ్చింది. వెండి పాత్రలతో నిలిచింది. స్వచ్ఛంద మందాకినీ తీరం నుండి అందం ఆనందం చిందిస్తూ మంచినీరు తెచ్చింది. నీవు నృత్య భంగిమలో లోనికి వెళ్ళి తృటిలో గంగా జలంలోని హిరణ్య గర్భలింగం తీసుకురా! అన్నాడు. అంతే ఆదిశంకరుడి ఆజ్ఞ తలదాల్చి పరుగు పరుగున వెళ్ళి తళతళల హేమ లింగాన్ని తీసుకొని పవిత్ర ముఖద్వారం గుండా పరుగెత్తుకొని వచ్చింది. ఒక అద్భుత లింగంతో అరక్షణంలో రాత్రి గం॥7-15 ని॥లకు వచ్చింది. శ్వేత, శుద్ధ వస్త్రం, హస్తం పట్టుకోబోతోంది. ఇంతలో కుడి ప్రక్కనుండి చేతిలో నుంచి జారిపడింది. అది స్వర్ణస్ఫటిక వజ్రం. అది తన శక్తిని ప్రదర్శించింది. ఖంగుమంది. జగం ఉలిక్కిపడింది. కన్నులముందు వజ్రకాంతి, స్వర్ణకాంతి. స్వర్ణకాంతుల్లో పరిశుద్ధ తేజస్వరూపం. ఊర్ధ్వ పుండ్రాలా అనునట్లు తెల్లని రెండు రేఖలు అద్భుతం అనిపించేలా ఉంది. నాగపాశంతో కట్టిన గణపతి లంబోదరమా అన్నట్లుంది. ఆశ్చర్యం - అద్భుతం - ఆనందం - స్వామి అనుగ్రహ ప్రతిబింబం.

స్వామి ఆనందంగా అనుగ్రహం పొంగిపొరల భక్తవర్యులకు వరుస వరుసలో తిరిగి అందరికి చూపించారు. ఇదిగో! దర్శించండి! తరించండి! ఇదిగో! ఇదిగో! అని మరీ దగ్గరకు వచ్చి స్పృశింపజేశారు. మహాసంతోషించారు.

హేమం హేమలింగం, స్వామిలింగం జగన్మోహనం అతి మనోహరంగా ఉంది. అది తళతళలీనుతుంది. ఖంగున చెంగున అందమైన కందుకంపలె ప్రకాశించింది. స్వామి చేతిలో మరీ ప్రకాశించ సాగింది. స్వామి అందంగా రెండువ్రేళ్ళ మధ్య పట్టి అందరికి చూపించాడు. విద్యార్థుల దగ్గరకు వెళ్ళి చూపాడు. వృద్ధుల దగ్గరకెళ్ళి చూపాడు. సమీప దర్శనాభిలాషులకు మరీమరీ అడిగి చూపించాడు. అందరికీ చూపారు.

ఆ లింగంలో ద్వాదశలింగాలు దర్శించారు. ఆనందం! ఆనందం! జనం జన్మతరించింది. ఎంత అదృష్టం! ఆత్మలింగం దర్శించాము అనుకొని అఖండ జన సందోహం ఆనందించింది.

'వందే సుందర 'సత్యసాయి' సుపదం సౌందర్య 'రత్నాకరం'
'భారద్వాజ సుగోత్ర' రాజశిఖరం ప్రేమప్రభావిగ్రహమ్
'ఆపస్తంబ' 'సువర్ణసూత్ర' తరలం లీలాజగన్నాటకం
'శాంతిశ్రీ' 'హృదయం' 'ప్రశాంతి నిలయం' 'సత్యంశివంసుందరమ్'

## సృష్టి - సృష్టికర్త

*స్వామి చుట్టూ కొందరు భక్తులు మూగారు. వారిలో ఒకరికి స్వామి ఏదో సృష్టించి ఇచ్చారు. అంతే! మిగిలిన వారందరూ ఆ భక్తుని చుట్టూ మూగగానే, స్వామి ఆ గుంపు నుంచి వదిలించుకొని వెళ్లిపోతూ తనతో వచ్చిన వారితో అన్నారు. "చూశారా! ఇదే తీరున అందరూ సృష్టికర్తను మరచి సృష్టివినోదమే గొప్పదని భావించి దానికి ఆకర్షింపబడుతున్నారు."*

మంచి అవకాశము

Phone : 87215
S.T.D. : 08555

# శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి, అనంతపురం జిల్లా.



మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు, ఇండ్ల స్థలములు
కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రస్సుకు సంప్రదించవలెనని కోరడమైనది.

- సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు
- గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు
- **M.R.O.** ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు
- బీడుపల్లికిపోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు
- అపార్ట్‌మెంట్స్ కావలసినవారు
- ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు
- పుట్టపర్తి రైల్వేస్టేషన్ ఎదురుగా గల ప్లాట్లు

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును**

ఇట్లు

శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్



**ప్రొ॥ పి. సిద్దయ్యశెట్టి**



ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్

ఆర్యవైశ్యసత్రం ఫ్రంట్‌రూమ్, పుట్టపర్తి - 515 134.



# మంగళవారం - మారుతి



"ఆంజనేయం మహావీరం, బ్రహ్మవిష్ణు శివాత్మకం
తరుణార్క ప్రభం శాంతం, రామదూతం నమామ్యహం"

మహావీరుడు త్రిమూర్తి స్వరూపుడు అమిత తేజస్సు కలవాడు శ్రీరామదూత అయిన శ్రీ ఆంజనేయస్వామికి అనేక వందనములు. నవ విధ భక్తి మార్గాలలో చివరిది అయిన ఆత్మనివేదనం అతిఉత్కృష్టమయిన దశ. శ్రీరామ భక్తులలో ఆత్మార్పణం చేసుకొనిన పరమభక్తాగ్రేసరుడు శ్రీ ఆంజనేయుడు. దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయుటకు శ్రీరామబంటుగా ఆ శివుడే అవతరించాడని పురాణములు చెపుతున్నాయి. అందుకే అంజనీసుతుని రుద్రాంశ సంభూతు డంటారు. మారుతి మోహబంధములకు అతీతుడు. హనుమంతుని ప్రభుభక్తి స్వామికార్యమునందు అనురక్తి అసామాన్యము. పట్టుదల కార్యదీక్షగలవాడు పవన కుమారుడు. దేహబలము ధృడసంకల్పము బుద్ధికుశలము, ఆత్మస్థైర్యము, నిర్భయత్వము, ధైర్యము, కర్తవ్యపాలనము, దూరదృష్టి, సమయస్ఫూర్తి పుట్టుకతో వచ్చిన లక్షణములు. ఇన్ని సద్గుణములు కలవాడు కాబట్టే స్వామి సీతాన్వేషణ సత్ఫలితాన్నిచ్చింది.

మారుతి శ్రీరాముని కుశలవార్త లంకలోనున్న సీతా దేవికి తెలిపిన మంగళకరమైన రోజు మంగళవారమని అందుకే మంగళవారం స్వామికిప్రీతికరమైన రోజు అంటారు. ఆ రోజున ఆకుపూజచేయటం, వడపప్పు, మిరియాలు వేసిన పానకము వరిపిండితో చేసిన అప్పాలు నివేదించటం పరిపాటి. ఇవన్నీ భౌతికమైన పూజలు, నివేదనలు. కానీ స్వామికి అత్యంతప్రీతికరమైనది, ఆనందకరమైనది, సంతోషకరమైనది ఒకటున్నది. అదే శ్రీరామనామము, శ్రీరామ గానము, రామభక్తి ఇవే స్వామికి ముఖ్యమయినవి.

"యత్ర యత్ర రఘునాథకీర్తనం, తత్ర తత్ర కృత మస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణలోచనం, మారుతిమ్ నమత రాక్షసాంతకమ్'

అన్నారు. ఎక్కడయితే శ్రీరామనామకీర్తన జరుగుతూ ఉంటుందో అక్కడ అంజలి ఘటించి ఆనంద బాష్పములు జాలువార తన్మయత్వంతో ఉంటారుట స్వామి. ఒకసారి స్వామి! ఓ రామభక్తులారా! మోక్షాన్ని కోరేవారు శ్రీరామచంద్రుని పాదముల నాశ్రయించండి. లౌకికమైన కోరికలు నన్ను అడగండి. శ్రీరామ ప్రభువు దయతో నేను మీరు కోరిన కోరికలు తీరుస్తాను. భూత-ప్రేత-పిశాచ బాధలను కూడా తొలగిస్తాను అని వాగ్దానము చేశాడుట వాయునందనుడు.

శ్రీరామ భక్తాగ్రగణ్యుడయిన ఆంజనేయుడు సర్వవిద్యావిశారదుడు - మహావీరుడు. వేదవేదాంగముల నభ్యసించిన మహాజ్ఞాని. ధైర్యము, సూక్ష్మదృష్టి, నిర్ణయాత్మక శక్తి ఆయన సహజ గుణములు. సంగీత విశారదుడు, శ్రీరామభక్తిని శ్రీరామనామశక్తిని ముల్లోకాలకు చాటిచెప్పిన పరమభక్తాగ్రేసరుడు. హనుమంతుడు అనగా సర్వసంకటములను హరించువాడు, సర్వభూత - ప్రేత - పిశాచగ్రహబాధలను నివారించువాడు. గుణవంతుడు, బలవంతుడు, బుద్ధిమంతుడు. జ్ఞానమయుడు, జితేంద్రియుడు, మహావీరుడు, రుద్రాంశసంభూతుడు శ్రీరాముని నిజభక్తుడు ఆంజనేయుడు.

'బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వయ రోగతాం
అజాడ్యం వాక్పటుత్వంచ, హనుమత్ స్మరణాన్ భవేత్

హనుమయొక్క స్మరణవలననే బుద్ధి, ధైర్యము, స్థైర్యము, యశస్సు కలుగుతాయి. కలియుగములో కూడా ఆంజనేయస్వామి ప్రత్యక్షదైవము. 'శ్రీరామచరితమానస్' ను రచించిన శ్రీరామభక్తుడైన గోస్వామి తులసీదాసుకు హనుమఎన్నోసార్లు దర్శనమిచ్చారుట. అందువలననే తులసీ దాసు 'హనుమాన్ చాలీసా' వ్రాసి తన యొక్క కృతజ్ఞతను భక్తితత్పరతను చాటుకున్నాడు. ఈ హనుమాన్ చాలీసాను రోజుకు ఒక్కసారి చొప్పున నలభై రోజులుగాని; ఒకేరోజు నూటఎనిమిదిసార్లుగాని పారాయణ చేస్తే దాని మహిమ వర్ణింపనలవికాదనికూడా తులసీదాసు తెలియజేశారు.

"మనోజవం మారుత తుల్యవేగం, జితేంద్రియం బుద్ధిమతా మరిష్టం
వాతాత్మజం వానరయూధ ముఖ్యం, శ్రీరామదూతం శిరసానమామి"

ఈ మంగళవార శుభదినమున ఆ రామదూతకు శిరస్సు వంచి నమస్కరిద్దాం. మనసారస్మరించి పూజించి తరించుదాం.

- కొమరగిరి జయప్రద



# స్వదేశాన్ని విస్మరించకు! పరదేశబిక్షగాడివికాకు!

ప్రేమస్వరూపులారా!

చందనపు చెక్కను ఎన్నిపర్యాయములు సానపీద అరగదీసినప్పటికినీ సుగంధమే మనకు ప్రాప్తిస్తుంది. చెఱకును నమిలిన కొద్దీ మనకు మాధుర్యమే ప్రాప్తిస్తుంది. బంగారమును ఎన్నిపర్యాయములు అగ్నిలో కాల్చినప్పటికినీ పరిశుద్ధమే అవుతుందిగాని, అందులో మాలిన్యంచేరదు. ఈ సువర్ణమునందు పరిశుద్ధమైన అపరంజియే మనకు ప్రాప్తిస్తుంది. అదే విధముగనే సజ్జనునికి ఎన్ని ఆపదలు సంభవించినా, దుఃఖములు వచ్చినా, కష్టములు మీదపడినా, అతను ప్రశాంతంగా, ఆనందంతో, గొప్ప మనసుతో జీవితాన్ని గడుపుతుంటాడు

సూర్యుని వెలుగులో అనేకమంది అనేక కర్మలు ఆచరిస్తుంటారు. ఎవరు ఎన్ని కర్మలు ఆచరిస్తున్నప్పటికీ, వీటితో సూర్యునికి ఎట్టి సంబంధంవుండదు. అదే విధముగ వ్యక్తి శారీరక మానసిక ఇంద్రియములతో ఎన్ని బాధలు పొందినప్పటికినీ, ఇది ఇంద్రియమనోబుద్ధులకు సంబంధించినవేగాని, ఆత్మచైతన్యమునకు ఏమాత్రం సంబంధం వుండదు. భక్తులు భగవంతుని అన్వేషిస్తున్నారని శాస్త్రములు చెబుతున్నాయి. కాని భక్తుడు, భగవంతుని వెదకనవసరం లేదు. సర్వత్రా వున్నటువంటి భగవంతుని వెదకటం ఎందుకు? అసలు భగవంతుడే నిజమైన, సత్యమైన భక్తుని కోసం వెదుకుతున్నాడు. వేడి ఇనుపగుండు తాకినప్పుడే గుండు కాలింది! అని అంటాము. కాలింది గుండుకాదు. గుండులో లోపల బయట వ్యాపించినటువంటి అగ్ని చేతిని కాల్చింది. అదే విధముగనే ఈ ప్రపంచం ఒక గ్లోబు. ఇదంతా ఒక పెద్ద గుండువంటిది. ఇందులో లోపల వెలుపల కూడా దైవ శక్తియే ఆవిర్భవించి ఉన్నది. కాని ఆ దివ్యశక్తిని మనం గుర్తించుకొనలేక, ఈ ప్రపంచంలో అనేక దుఃఖములు, బాధలు, కష్టములు సంభవిస్తున్నాయని వాపోతుంటాం. ఈ జగత్ మనల్ని ఏమాత్రం బాధించటం లేదు, ఆనందమును అందించటం లేదు. ఇది కేవలం ఇనుపగుండు వంటిది కాని ఇందు నుంచి కష్టసుఖములనేటటువంటి ప్రతిబింబములు ఆత్మ చైతన్యము యొక్క ప్రభావములే. కనుక మనకు ఏది జరిగినప్పటికినీ అది ఆత్మ యొక్క ప్రతిబింబమే, ఆత్మ యొక్క ప్రకాశమే, ఆత్మ యొక్క ప్రభావమే, ఆత్మ యొక్క ప్రసాదమేనని మనం భావించాలి.

ఈనాడు లోకంలో అనేకమంది లోపల ఒకటి, బయట మరొకటి పెట్టుకొని నటిస్తున్నారు. ఇలాంటి కుటిల చిత్తుల కోసం భగవంతుడు అన్వేషించడంలేదు ఈనాడు కొందరు ఏడుపువస్తే, నవ్వుతారు; నవ్వువస్తే ఏడుస్తారు ఇలాంటి కపట వేషధారుల కోసం భగవంతుడు

## భగవాన్ సాయి హితబోధ

అన్వేషించడం లేదు. ఇటువంటి వారి ఆకారం కేవలం మానవ ఆకారమేగాని, బుద్ధి వానరబుద్ధి. కనుక ఇలాంటి బుద్ధులు లేకుండా, మానవుడు మానవుడుగా జీవించాలని భగవంతుడు ఆశిస్తుంటాడు మానవునియందు సహజంగా వుండినటువంటి పవిత్రమైన భావములను మనం ప్రకటించాలి గాని, కల్పితమైన, కృత్రిమమైన గుణములను మనం ప్రకటించరాదు. కాని ఈనాటి మానవుడు నైతికంగా దిగజారిపోతున్నాడు, భౌతికంగా కూడా పతనమైపోతున్నాడు కనుక మానవుడు ఆయుః ప్రమాణమును పెంచుకొని, దానిని సద్వినియోగం గావించుకొనే మార్గంలో ప్రవేశించాలి. ధనము ఖర్చు చేసినప్పుడే తరిగిపోతుంది. కాని ఆయువుమాత్రం ఖర్చు పెట్టినా, పెట్టకపోయినా అది క్షీణించిపోతుంటుంది. ప్రతిమానవుని శిరము పైన కాలము కరవాలము త్రిప్పుతునే ఉంటుంది. కనుక మనము ఈ కఠినమైన కరవాలమునకు గురికాకుండా చూచుకోవాలి. కాలము పోతేరాదు. ఆరోగ్యం పోతే సంపాదించుకోవచ్చును. ధనం పోతే తిరిగి సంపాదించుకోవచ్చును. కాని పోయిన కాలం తిరిగిరాదు.

ప్రేమస్వరూపులారా!

ఈ కాలమును సద్వినియోగం గావించుకొనే నిమిత్తమే, అనేక సత్కర్మలు మనం ఆచరిస్తూ రావాలి.

ఇలాంటి సత్కర్మల ద్వారానే మానవునిలో సద్భావములు ఆవిర్భవిస్తాయి. కనుక పవిత్రమైన, దివ్యభావములు అభివృద్ధిగావించుకోవాలి. సూర్యునినుండి ఆవిర్భవించిన వెలుతురు, మేఘములుగామారి, సూర్యునినే కప్పి వేస్తుంటాయి. అదేవిధముగ మానవుని హృదయమునుండి ఆవిర్భవించినటువంటి మనోమాలిన్యమనే మేఘములు తిరిగి హృదయాన్నే కప్పివేస్తుంటాయి.

సృష్టికి ఆధారము భగవత్ ప్రమాణమే. దానికే 'ప్రకృతి' అని పేరు పెట్టారు. ఈ ప్రకృతి నుండి ఉద్భవించిన ప్రతి మానవునికి కూడనూ, సృష్టి స్వభావములే ఆవిర్భవించాలి. సృష్టికి విరుద్ధమైన భావములు రాకూడదు. కామక్రోధలోభమోహమద మాత్సర్యములు, మన ఆహార విహారముల నుండి ఆవిర్భవిస్తుంటాయి. ఇవి ప్రకృతి నైజములు కావు 'నేను ..నేను...' అని నీవు ఉచ్చరిస్తున్నావు. ఆ 'నేనే' భగవంతుని యొక్క మూలాధారమైన మంత్రము. 'నేను' అనే మంత్రము పుట్టిన తరువాతనే మిగిలినవన్ని మంత్రములు ఆవిర్భవించినాయి. అదియే 'అహం బ్రహ్మాస్మి'. 'నేను' అనేది బ్రహ్మ. బ్రహ్మకు మొట్టమొదటి పేరు 'నేను' రెండవది 'ఆత్మ'. మూడవది 'ఉనికి'. నాల్గవది 'బ్రహ్మ'. ఐదవది 'భగవంతుడు! ఇవన్నీ భగవంతుని పరిణామ పదములే. ఇలాంటి పదములకు సరైన అర్థమును గుర్తించాలి.

అసలు ఈ 'నేను' అనే పదము ఎక్కడ నుంచి వచ్చింది? ఇది కేవలం ఆత్మతత్త్వ స్వరూపమే. ఇది దైవము యొక్క స్వరూపమే. అయితే 'నేను' పదమును ఎన్ని విధములలో దుర్వినియోగం గావించుకుంటున్నాము. ఇటువంటి పదములను సరియైన మార్గంలో సద్వినియోగం గావించాలి.

ప్రేమస్వరూపులారా!

నిత్యజీవితంలో ఏవిధంగా మనం సత్యమైన జీవితాన్ని గడపాలో గుర్తించుకోవాలి. ఇలాంటి దానికోసం ప్రయత్నించకుండా, జపము, ధ్యానము, యోగము- ఇలాంటి కర్మలు ఆచరించటం చాలదు. ఈ సాధనలతో పాటు మానసిక భావములను కూడా పెంపొందించుకోవాలి. కనుక మానవత్వంలోపల మొట్టమొదట సద్గుణములు, సద్భావములు, సదాలోచనలు, సత్ప్రవర్తనలు అభివృద్ధి పరచుకోవాలి. ఇవియే ప్రకృతి యొక్క సహజగుణములు.

## ఓ యుగాధిపా!!

నూత్న బడ్జెట్టుతో నవరత్నకాంతు
విడుచు పథము జూపగ వచ్చె ; నిడుములన్ని
తుడిచివేయునా? దొరలకు పడకలయ్యె
లోటు తీర్పగ జాలదీ ఓటు హక్కు!

పరగు షడ్రుచుల నుగాది పచ్చడరసి
అందు నవరసాలను నింపి - విందు సేయ
ఆగమించె ; 'యుగాది' పసందు కూర్ప!
జీవితమ్ములు మరపును జెందిమనునె?

ధరణియందు మధ్యతరగతి బ్రతుకులు
మందహాసమయ్యె - మానికిలేక
శాంతి సూక్త మేల? జనత కడుపుమంట
లార్పు 'నవయుగాది' - తీర్పుమార్పు!

'నోటు' లేని బ్రతుకు - నొప్పికి బలియయ్యె
సాటిరానివాడు - మేటిఘనుడు!
గాలిబుడగవంటి - గాత్రమరయ - మల
మూత్ర రక్త మాంసములకు నెలవుకాదె!

'కార్గిలందు' మారణహోమ కాండరగిలె
సకల పెనుతుఫానుకు 'ఒరిస్సా' దహించె
ప్రథిత అణ్వస్త్రభూతమ్ము ప్రబలమాయె
కలుషిత జనారణ్యాన హింసలు మిగిలెను

'స్కాము' కుంభకోణాలతో స్వాములగుచు
స్వార్థపరత విజృంభింప - చరితకెక్క
దేశప్రగతి నేరీతి సాధించగలవు?
విక్రమింపుడీ 'విక్రమ' విజ్ఞతెజిగి!

ఓ యుగాధిపా! ఇకనైన ఉవిదలోన
శాంతి దాంతి సౌఖ్యాలనీయ - సాహసించు
మానవత్వమందు జనత మానుపనెంచి
నవవసంతమందు నీవు - నడక నేర్పు!

బ్రతుకు సుఖదుఃఖములకు మిశ్రమమటంచు
వేపపువ్వు పచ్చడి నేడు - విలువలొసగి
తెలియ జెప్పగ వచ్చి సందేశమిచ్చె!
ఫలితము ప్రసాద బుద్ధిని బడయువలయు!

- ఆచార్య శ్రీవత్స, ఉయ్యూరు

అయితే మనం అలాంటి ప్రకృతియందు జన్మించి, ప్రకృతి భావములను వదిలి, కృత్రిమమైన భావములను మనం అనుసరిస్తున్నాం ఈ కృత్రిమమైన జీవితాన్ని మనం గడుపకూడదు. హృదయంలో ఉన్నది మాటలో, మాటలో వున్నది చేతలో రావాలి. అదియే మానవత్వము. అతనే నిజమైన మానవుడు. అలాంటి, అట్టి నిజమానవుని నిమిత్తమై అన్వేషణ సలుపుతున్నాడు భగవంతుడు. కేవలం వేషధారియైన మానవుని కోసం భగవంతుడు అన్వేషణ సలపటంలేదు.

మానవుడు తనసుతాను గుర్తించుకొనే నిమిత్తమై, భగవంతుడు 'బుద్ధి'ని ప్రసాదించాడు. అది ఉత్తమమైనటు వంటిది, శుద్ధమైనటువంటిది. ఆ 'బుద్ధి' అనే అద్దమునకు వెనుక వైపున 'ప్రేమ' అనే రసాయనం పూసాడు. అద్దమునకు వెనుకవైపున ఈ రసాయనమే లేకపోతే మన ముఖం అద్దములో కనిపించదు. అదేవిధముగనే మన బుద్ధికి వెనుక 'ప్రేమ' అనే రసాయనము కలిపించాడు. అయితే 'ప్రేమ' అనే రసాయనం లేని అద్దమును చూచుకోవటం చేత మనకు అద్దమునకు వెనుక వున్నది కనిపిస్తున్నాయి గాని అద్దమునకు ముందున్నవి కనిపించటం లేదు. నీ స్వరూపాన్ని నీవు గుర్తించాలి. నీ స్వరూపాన్ని నీవు గుర్తించాలంటే, అద్దమునకు వెనుక రసాయనం పూయాలి. అయితే ఈనాడు ప్రేమరహితమైన అద్దమును ముందుపెట్టుకొని మన ముఖమును మనం చూడటానికి ప్రయత్నిస్తున్నాం. మన ముఖము మనకు కనిపించటంలేదు. కారణమేమిటి? అద్దము వెనుక ఈ ప్రేమ రసాయనం లేకపోవటమే. అట్టి ప్రతిబింబాన్ని నిరూపించే నిమిత్తమై మనకు భగవంతుడు 'బుద్ధి' అనే అద్దమును ప్రసాదించాడు. ఈనాడు మానవుడు తన బుద్ధి చేత తన స్వరూపాన్ని గుర్తించడానికి ప్రయత్నించటం లేదు. ఆ అద్దమును తీసుకొని వెళ్ళి ఇతరుల ముఖము ముందు పెడుతున్నాడు. వాడి ముఖము కనిపిస్తుందిగాని, నీ ముఖము ఎక్కడ కనిపిస్తుంది? అదే విధముగ ఈనాటి 'బుద్ధి' ప్రతిఒక్కరిని ప్రపంచమును విచారించడానికి ప్రవేశపెడుతున్నది. ఎవర్ని చూచినా ఎవరండి మీరు? ఎక్కడనుంచి వచ్చారు? మీపేరేమిటి? మీ ఊరేమిటి? అని వారిని ప్రశ్నిస్తుంటారుగాని, ప్రపంచమును ప్రశ్నిస్తుంటారు గాని, తనను తాను ప్రశ్నించుకోవటానికి ప్రయత్నించటం లేదు. కనుక మొట్టమొదట Who are you?.. Who are you? అనేదానిని ఆపివేసి Who Am I? . Who Am I? అనే దానిని మొదలుపెట్టాలి. నీకు బుద్ధిని యిచ్చింది నిన్ను నీవు చూచుకోవడానికిగాని పరులను చూడటానికి కాదు. ప్రపంచ విషయాలు పెరిగిపోవటంచేత తన సత్యాన్ని తాను మరచిపోతున్నాడు. చిన్న పిల్లవాడి మొదలుకొని పెద్దమనిషి వరకు ప్రపంచ విషయాలలోనే ప్రవేశిస్తున్నాడు. భూమండలమేకాదు ఆకాశంలో ప్రవేశిస్తున్నాడు. నక్షత్ర మండలంలో ప్రవేశిస్తున్నాడు. కాని తనలో తాను ప్రవేశించటంలేదు. **లక్షల మైళ్ళు అంతరిక్ష యానం ప్రయాణం చేస్తున్నాడుకాని హృదయాంతరాళంలో ప్రవేశించటంలేదు.** కనుకనే మానవుని వికారములు అన్నీ వికృతస్వరూపాన్ని ధరిస్తున్నాయి. స్వార్థం. .స్వార్థం.... స్వప్రయోజనం కాని స్వస్వరూపాన్ని దర్శించడానికి ప్రయత్నించటం లేదు.

**ప్రేమస్వరూపులారా!**

స్వస్వరూపాన్ని దర్శించడమే ఆధ్యాత్మికము యొక్క ప్రథమ లక్ష్యము. కేవలం ఆధ్యాత్మిక మార్గమునందేకాదు, లౌకికము, భౌతికము, ధార్మికము, వ్యవహారికమునందు కూడనూ మొట్టమొదట తన తత్వాన్ని తాను గుర్తించాలి, ఇతరుల దోషాలను వెదకటానికే ప్రయత్నిస్తున్నావు కానీ నీ దోషాలను నీవు గుర్తించడానికి ప్రయత్నించటం లేదు. నీ దోషములను నీవు ఏనాడు వెదుకగలవో, ఆనాడు నీవు బాగుపడుతావు. అట్టివాడు ఆదర్శపురుషుడుగా రూపొందు తాడు. కనుక మనం ఈనాడు ప్రపంచములో జరిగే విషయాలను అన్వేషణ చేయకుండా మొట్టమొదట తనను తాను తెలుసుకోవటానికి కృషి చేయాలి.

దేహాభిమానం పెరిగిపోతున్నది. ఆత్మాభిమానం **తరిగిపోతున్నది. ఆత్మలేని దేహం ఏ మాత్రం నిలబడదు. ఈ దేహాభిమానాన్ని దినదినం తగ్గించుకుంటూ రావాలి. దీనిని పెంచుకొనినకొలది ఆశలు, దురాశలు పెరిగి పోతుంటాయి.** ప్రాపంచిక సంబంధమైన విషయవాసనలు ఎన్ని ఆచరించినప్పటికినీ, అవి అప్పటికప్పుడే ఆనందాన్ని చేకూరుస్తాయిగాని, సత్యమైన, నిత్యమైన ఆనందాన్ని ఏమాత్రం అందించవు. అయితే దానితోపాటు అంతర్భావాన్ని కూడా అభివృద్ధిగావించుకోవాలి. ఈ అంతర్భావమే లేకుండిన, బహిర్ముఖమైనదంతయూ కేవలం **'పశ్యతీతి పశుః' బహిర్ దృష్టికలది పశువే.** కనుక మనం కూడా

పశువులవైపోతున్నాం. బయట దృష్టినే మనం ఆకర్షిస్తున్నాం, బయట చర్యలనే మనం ఆశిస్తున్నాం. ఇది కాదు నిజమైన మానవత్వం. నీ అంతర్భావాన్ని కొంతవరకు పరిశుద్ధంగావించుకోవాలి. నిర్మల, నిశ్చల, నిస్వార్థ బుద్ధిని మనం పెంచుకోవాలి అప్పుడు మనం అందరినీ ప్రేమించగలం, అందరినీ విశ్వసించగలం. అయితే ఈనాటి మానవుడు తనను తాను కూడా విశ్వసించటం లేదు. అందరినీ విశ్వసించినట్లుగా నటిస్తున్నాడు. అదియే మానవుని దోషము. మొట్టమొదట తనను తాను విశ్వసించాలి. దానినే ఆత్మవిశ్వాసమంటారు.

ప్రేమస్వరూపులారా!

ఈనాటి పరిస్థితులలో మనకు విశాలమైన తత్త్వం కావాలి. సంకుచిత భావములు, వ్యక్తిగతమైన భావములు కొంతవరకు అణగద్రొక్కాలి. స్వార్థ స్వప్రయోజనములను ప్రక్కన పెట్టాలి. విశాలమైన దృష్టిని మనం పెంచుకోవాలి. మన కన్ను ఒక అంగుళం కూడా లేదు. ఈ చిన్న కన్ను ఎంతో దూరంగా వున్న నక్షత్రాలను చూడగలుగుతున్నది. ఎంతో దూరంగా వున్న వస్తువులను చూడగలుగుతున్నది. మనయందు అంతర్ దృష్టిని పెంచుకుంటే ఇంకా ఎంతైనా మనం సాధించవచ్చును. **విదేశీయులు Broad Heart కావాలంటారు. అదికాదు Broad Mind కావాలి. Broad Heart అయితే Heart Enlarge అయినట్లవుతుంది. Broad Mind వుంటే విశాలమైన భావములే ఆవిర్భవిస్తాయి.**

విద్యార్థులారా!

మీరు ఈ విశాలమైన ప్రపంచంలో జన్మించారు. ఈ విశాలమైన సంస్థలో మీరు వుంటున్నారు. మీరు కూడా విశాలమైన భావములతోనే వుండాలి. సంకుచిత భావములు ఏమాత్రం వుండకూడదు. ఇతరుల దోషములను వెదకకూడదు. ఇది చాలా తప్పు. ఒకవేళ వారియందు దోషములుండవచ్చును. కాని నీవు చూడవలసింది దోషములుకాదు. వారియందున్నటువంటి ఉత్తమమైన భావములను మాత్రమే తీసుకోవాలి. మీరందరూ ఈ విశ్వకుటుంబంలో సభ్యులు. అంతా ఒక కుటుంబమే. Brother Hood of Man, Father Hood of God. అప్పుడు అందరూ సోదరులుగా వుంటారు. ఇలాంటి సోదరత్వాన్ని పెంచుకోవాలి. అందరూ భగవంతుని యొక్క అంశములే. ఈ సృష్టికి సూత్రధారి దైవత్వం. ఆ దైవత్వం కంటికి కనిపించదు, చెవులకు వినిపించదు, మనసుకు అనిపించదు కాని దివ్యత్వము మార్పు మానసిక తత్త్వానికే అర్థమవుతుంది. దీనికి Understanding **చాలా అవసరం.** Understanding **చేసుకొనినప్పుడే** Adjustment **సులుతరమవుతుంది. కనుక అందరూ దైవము యొక్క ప్రతిబింబాలే అని** Understand **చేసుకోండి. అప్పుడు మనకు ఎవ్వరిపైన ద్వేషముగాని, అసూయగాని, అహంకారంగాని ఆవిర్భవించదు.**

ప్రేమస్వరూపులారా!

మొట్టమొదట మీరు అభివృద్ధి పరచుకోవలసింది 'ప్రేమతత్త్వము'. ప్రేమకుమించిన దైవము మరొకటిలేదు. దైవము సర్వులయందూ వుంటున్నాడు. ప్రేమ రూపంలో వున్నాడు. కనుక ఆ ప్రేమస్వరూపాన్ని అందరిచేత గుర్తింప చేయాలి. ఆ ప్రేమస్వరూపాన్ని మనం ప్రదర్శించాలి. ప్రేమను గురించి చెప్పినంత మాత్రమున ప్రయోజనంలేదు. ఆచరణలో నిరూపించాలి. అప్పుడే మనకు తగినటువంటి గౌరవము, మర్యాదలు ప్రాప్తిస్తాయి.

విద్యార్థులారా!

మీలో అన్ని శక్తులూ ఉన్నాయి. మీరు శక్తి హీనులుగా భావించుకోకండి. తరతమబేధములను త్యజించి, అంతా ఒకటే అనే ఏకాత్మభావంలో ప్రవేశించి, సమాజసేవలలో పాల్గొనండి. అప్పుడే మానవ జీవితం సార్థకమవుతుంది. ఏవ్యక్తికి ఏది అవసరమో గుర్తించి నిజమైనటువంటి సమాజ సేవ వర్తించాలి. వారికి ఆ సహకారము అందించాలి. ఈనాడు చాలామంది సమాజసేవ పేరుతో గ్రామాలలో ప్రవేశించి వీధులు ఊడుస్తున్నారు, దేవాలయాలకు రంగులు వేస్తున్నారు. అంతటితోనే తృప్తిపడుతున్నారు. అది సేవనే కాదు. అది మన కర్తవ్యం. అది మనం చేయవలసిన పని. అసలు నిజమైన సేవ అంటే ఏమిటి? ఆ గ్రామంలోని ప్రజల అశాంతికి కారణమేమిటి? అసౌకర్యాలకు మూలమేమిటి? వారికి ఏది అవసరము? వాటిని పరిశీలించి, వారి అవసరాలను తీర్చడానికి శక్తికొలది ప్రయత్నించాలి. ఆ విధంగా ఆ ప్రజల అవసరాలను తీర్చటమే నిజమైన సేవ. అయితే నేను సేవ చేస్తున్నాననే భావన రానీయకు. ఆ భావన నీలో వస్తే అహంకారం పెరుగవచ్చు. కనుక నా వారికి నేను సహాయం చేస్తున్నాను, ఇది నాకర్తవ్యము అని భావించు. అప్పుడే అది సేవగా రూపొందుతుంది. ఈ

## ధర్మవ్యాధోపాఖ్యానము

"సాధుః సన్నతి మానేన
సర్వత్ర ద్విజసత్తమ
మూఢానామవలిప్తానాం
అసారం భావితం భవేత్
దర్శయత్యంతరాత్మాతం
దివా రూపమివాంశుమాన్."

ఓ బ్రాహ్మణోత్తమా! సజ్జనుడు సర్వత్రా వినయశీలి గానే ఉంటాడు. అహంకారులైన మూఢుల ఆలోచనలన్నీ సారరహితంగానే ఉంటాయి. పగటి పూట సూర్యుడు వస్తువుల రూపాన్ని దర్శింప జేసినట్లుగా, మూర్ఖుల అంతరాత్మే వాళ్ళకు యదార్థస్వరూపాన్ని దర్శింపజేస్తుంది.

విధంగా ప్రజాసేవలో పాల్గొని మనం చదివిన చదువులను సార్థకం గావించుకోవాలి.

మనం చదివేచదువులు విదేశాలకు వెళ్ళి ధనము నార్జించడానికికాదు. అదియే మన భారతీయుల బలహీనత. ఇంజనీర్‌గాని, డాక్టర్‌గాని కావటంతోనే Pass Port కు ప్రయత్నిస్తున్నారు. మొట్టమొదట నీ దేశంలోని రోగులను చూడండి. నీ గ్రామములోని సమస్యలను పరిష్కరించండి. ఆ విధంగా చేయకుండా కేవలం ధనం కోసం ఈనాడు విదేశాలకు పరుగులు తీస్తున్నారు. ధనం ప్రధానం కాదు, గుణం ప్రధానం. జన్మించిన దేశం యొక్క బాగోగులు చూడాలి. అది మీబాధ్యత, కర్తవ్యం. కేవలం 'రామా! రామా!' అని రామ నామస్మరణ చేస్తున్నారు గాని, రాముడు చేసిన కార్యాలను మాత్రం చేయడం లేదు. రాముడు తన రాజ్యాన్ని కూడా త్యజించి, తండ్రి ఆజ్ఞను శిరసావహించి, పదునాలుగు సంవత్సరాలు అరణ్యావాసం చేశాడు. అది ముఖ్యం. మన దేహము, మన బుద్ధి, మన మనసు, మన చిత్తము, మన అంతఃకరణ అన్నీ మన తల్లిదండ్రుల ప్రసాదములే. మనలను చదివించిన తల్లిదండ్రులకు మొట్ట మొదట కృతజ్ఞతలు తెలియజేయాలి. వారికి సేవల నందించాలి. అదే మన ప్రప్రథమ కర్తవ్యం. అప్పుడే మనకు శాంతి లభిస్తుంది.

మనకు స్వాతంత్ర్యం వచ్చింది గాని మనలో ఐకమత్యం మాత్రం లేకుండా పోయింది. ఇంట్లో లేదు, బయటా లేదు. అందువలననే దేశంలో ఎక్కడ చూచినా, కష్టములు, దుఃఖములు, భయములు. వీటికి కారణము ఏమిటి? మనలో ఐకమత్యం లేక పోవటమే. కనుక మొట్ట మొదట ఐకమత్యమును మనం సాధించాలి. **ఐకమత్యమే జీవిత లక్ష్యం. కార్యాచరణే దీనికి మూలకారణం. ఈ ఐకమత్యము కార్యరూపమును ధరించాలి. అప్పుడే మనం చదివిన చదువులు సార్థకం అవుతాయి.**

ఉన్నత చదువులు చదువుతున్నారు. వెళ్లుతున్నారు విదేశాలకు. స్వదేశాన్ని విస్మరిస్తున్నారు. ఎత్తవలసిన బిక్ష నీ దేశంలో నీవు ఎత్తు. పరదేశ బిక్షగాడివి మాత్రం కాకు! తల్లి ఎంత కురూపి అయినప్పటికినీ, ఆమెనే అమ్మా! అని పిలుస్తాము గాని, అందంగా ఉన్న ఆమెను చూచి అమ్మా! అని పిలుస్తామా? కురూపి అయినా, కుంటిదైనా నీ తల్లి నీ తల్లే. అదేవిధంగా నీ దేశం పేదది కావచ్చు, బీదది కావచ్చు. అది నీ జన్మభూమి. అసలు భారతదేశం పేదది కాదు. సర్వశక్తులు భారతదేశంలో ఉన్నాయి. సర్వ సంపదలకూ నిలయం. భారతదేశం త్యాగభూమి, యోగభూమి, కర్మభూమి. ఇలాంటి భూమిని మనం ఈనాడు భోగభూమిగా మార్చడానికి ప్రయత్నిస్తున్నాం. భోగం, రోగాలనందిస్తుంది. ఈ భోగభూమి మనకు వద్దు. **త్యాగం మన జీవిత లక్ష్యం కావాలి. నడుం వంచి పని చేయాలి. చేతులకు పని పెట్టాలి. చేతి నిండా పని, మనసు నిండా మంచి భావములు పెట్టుకుంటే ఇంతకన్నా మంచి మనిషి ఎక్కడ ఉంటాడు? ఇతనే నిజమైన మనిషి. అట్టి నిజమైన మనిషి కోసం భగవంతుడు వెదుకుతున్నాడు.** కనుక దైవాన్వేషణ కోసం ప్రయత్నం చేయకండి. మంచి మనిషిగా తయారు కావడానికి ప్రయత్నించండి. మనం మంచి మనుషులం కావాలి కాని గొప్ప మనుషులం కానవసరం లేదు.

ఈనాడు దేశంలో జరిగే అరాచకాలకు, కష్టములకు, దుఃఖములకు, విచారములకు మూలకారకులెవరు? విద్యావంతులే మూలకారకులు. ఎందుకంటే ఈ దేశం కోసం చేయవలసినంత ఉపకారం చేయకుండా, సహకారం చేయకుండా తమ శక్తిని తమ స్వార్థం కోసమే ఉపయోగ పెడుతున్నారు. భారతదేశంలో ఎంతో మంది మేధావులు ఉన్నారు. ఇంతమంది మేధావులు కూడనూ ఈ దేశమును ఇటువంటి పరిస్థితికి ఎందుకు తీసుకొని వచ్చారు? వారిలో సేవాభావం, ఉపకారబుద్ధి లేకపోవడమే దీనికి కారణం. వారిలో గనుక పవిత్రమైన భావం ఉంటే దేశం ఎంతైనా

బాగుపడుతుంది. వారి తెలివితేటలు, వారి మేధాశక్తినంతా విదేశాలలో ఉపయోగాపెడుతున్నారు. ఈ దేశంలో 10 వేల రూపాయలు జీతం తీసుకుంటూ కూడా పది రూపాయల పని కూడా చేయటం లేదు. ఈ దేశానికి ఎంత నష్టం చేసినట్లు? వారే విదేశాలకు వెళ్ళి అక్కడ కావల్సినంత పని చేస్తుంటారు. Extra Work (అదనపు పని) కూడా చేస్తుంటారు. రాత్రిళ్ళు కూడా పనిచేస్తుంటారు. ఇంత శ్రద్ధ విదేశాలలో చూపుతున్నప్పుడు, స్వదేశంలో ఎందుకు చూపకూడదు? కనుక స్వదేశంపైన ప్రేమ తత్త్వాన్ని, శ్రద్ధను, విశాలభావాన్ని ప్రకటించాలి. ఇదే భక్తి. భక్తి అంటే కేవలం దేవుని పటము పెట్టి పూజించటం కాదు. అవన్నీ కేవలం సత్కర్మలు మాత్రమే. సద్భావాన్ని పెంచుకోవాలి. సద్భావములు లేకుండా సత్కర్మలు చేసి ప్రయోజనం ఏమిటి?

ప్రేమ స్వరూపులారా!

ఇది శివరాత్రి. 'శివ' అంటే మంగళం. అనగా పవిత్రమైన భావంతో మన జీవితాన్ని గడపాలి. రాత్రంతా భజన చేశారు. చాలా ఆనందంగా ఉంటున్నది. అది కేవలం శ్రవణానందమే గాని హృదయానందం కాదు. శ్రవణానందంతో పాటు హృదయానందం కూడా చేరాలి. ఈ రెండూ చేరినప్పుడే దివ్యానందమును పొందగలం. కేవలం Negative Thoughts ఉంచుకొనిన ఏమి ప్రయోజనం? ఆ Negative Thoughts ను బయటకు నెట్టి వేయి, Positive Thoughts ను అభివృద్ధి పరచుకోండి. అప్పుడు సమాజము బాగుపడుతుంది. నీ దేశమూ బాగుపడుతుంది, నీ గ్రామము బాగుపడుతుంది, నీవు బాగుపడుతావు. కనుక వ్యక్తి నుంచి సమాజం వరకు సమాజసేవను వ్యాప్తి గావించాలి. కనుక సేవలను లక్ష్యంగా ఉంచుకోండి! త్యాగమును లక్ష్యంగా ఉంచుకోండి! పవిత్రమైన భావములను పెంచుకోండి! మంచి హృదయాన్ని పెంచుకోండి! మంచి కార్యాలను చేయండి! అప్పుడే మీ జీవితాలు సార్థకమవుతాయి!

(ది 5-3-2000 అనగా శివరాత్రి మరునాడు ఉదయం ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగం నుండి)

నీతికథలు - 3

## పులి - కంకణం - బాటసారి

ఒక అడవిలో ఒక ముసలిపులి వుండింది. అది ఒక దినం స్నానం చేసి దర్భలు చేత పట్టుకొని కొలనిగట్టున నిలుచుని వుండింది. అప్పుడా దారిలో ఒక బాటసారి పోతూవుండినాడు. పులి అతణ్ణి పిలిచి తన చేతనుండిన బంగారు కడియం చూపించి, వచ్చి తీసుకొనమంది. బాటసారి తన అదృష్టానికి ఆనందించి, ఆ కంకణం కాజెయ్యాలని ఆత్రుతపడ్డాడు. కానీ పులి క్రూరమృగం గదా! కాబట్టి దానిని నమ్మకూడదని సందేహిస్తూ నిలబడ్డాడు. అది కనిపెట్టి పులి అతనితో ఇలా అంది.

"ఓయీ! నేను మునుపు యౌవనంలో చాలా దుర్మార్గుడుగానే వుంటూ వచ్చాను. లెక్క లేనన్ని పశువుల్నీ, మనుషుల్నీ చంపి మితం లేని పాపాలు సంపాదించాను. భార్యాబిడ్డల్నీ పోగొట్టుకొని ఏకాకినయ్యాను. ఆ పిమ్మట ఒక పుణ్యాత్ముడు నా యందు కరుణించి, "ఇక మీదట ప్రాణిహింస చేయొద్దు, పుణ్యకార్యాలు చేయ" మని బోధించాడు. అది మొదలుకొని పాపకృత్యాలు మానుకొని, మంచిపనులు చేస్తున్నాను. ముసలివాడినైపోయాను. పండ్లు వూడిపోయాయి. గోళ్ళు మొక్కపోయాయి. లేవడానికి గూడా సత్తాలేదు. ఇల్లాంటోణ్ణి నన్ను నువ్వెందుకు నమ్మవు. నీవు దరిద్రుడవని దీన్ని నీకు దానం చేయాలనుకొన్నాను. అనుమానం వీడి ఈ కొలనిలో స్నానం చేసి వచ్చి యీ స్వర్ణ కంకణం పుచ్చుకో".

అనగానే వాడు పేరాస చేత దాని మాటలు నమ్మి కొలనిలో స్నానం చేయటానికి పోయి, మొలలోతు బురదలో దిగబడిపోయాడు. అప్పుడు పులి చూసి, "అయ్యయ్యో! అడుసులో దిగబడిపోయావే! నేనొచ్చి నిన్ను లేవనెత్తుతాను భయపడవొద్దు"అని మెల్లమెల్లగా దగ్గరకి వెళ్ళి వాణ్ణి పట్టుకుంది. ఈలాగ వాడు దాని చేత తగులుకొని, "అయ్యో! ఈ క్రూర మృగాన్ని నమ్మి యీ గతి తెచ్చుకొంటినే! మించినదానికి చింతించి ఏమి ప్రయోజనం? ఎవరికైనా తలరాత తప్పించుకోతరం కాదు" అని గింజుకొంటూ వుంటే, పులి వాణ్ణి కమ్మగా స్వాహాచేసింది.

నీతి : కాబట్టి అన్ని విధాలా ఆలోచించికాని ఏపనీ చేయకూడదు. చక్కగా విచారించి చేస్తే కీడు కలగదు.

- మునికృష్ణారెడ్డి



# పురుష సూక్తము

**10**

"తస్మాద్యజ్ఞాత్ సర్వహుతః
ఋచ స్సామాని జజ్ఞిరే
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్
యజుస్తస్మా దజాయత"

అర్థం :

| | |
|---|---|
| సర్వహుతః | : 'సర్వహుతం' అనే |
| తస్మాత్ యజ్ఞాత్ | : ఆ యజ్ఞం వలన |
| ఋచః | ఋగ్వేద పాఠాలు |
| సామాని | : సామవేద పాఠాలు |
| జజ్ఞిరే | : జనించాయి |
| తస్మాత్ | ఆ యజ్ఞం నుండి |
| ఛందాంసి | : ఛందో భాగాలు |
| జజ్ఞిరే | : అవతరించాయి |
| తస్మాత్ | ఆ యజ్ఞం నుండి ఇంకా |
| యజుః | : యజుర్వేదం |
| అజాయతః | : ఉద్భవించింది |

వ్యాఖ్య :

"సర్వహుత" యజ్ఞఫలంగా పరమేశ్వర అనుగ్రహం వలన యజ్ఞ పురుషుని ద్వారా యజ్ఞక్షేత్రం నుండి నిగమరాశి ఆవిర్భవించింది. అది ఆగమవల్లులకు ఆలవాలమై కళ్యాణ కల్పతరుమూలమై సత్ఫలాలు అందించ సాగింది.

ఆ యజ్ఞ భూమినుండి ముందుగా ఋక్కులు పాటమరించాయి. సామవేదం కొనలుసాగింది. యజుస్సు ఫలించింది. ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, వేదాలు మూడు 'త్రయి' అని పేరుదాల్చాయి. స్తుతి రూపంగా ఆవిర్భవించినవి 'ఋక్కులు', నాద మాధురితో జనించిన సమ్యగానంద సమరసగానం 'సామం'. తాళలయగణబద్ధమైనది 'ఛందస్సు'. ఋక్సామ ఛంద సమన్వయయజనం 'యజుస్సు'. వేదం అఖండ వాగ్వైభవం. వాక్కు సంకల్పజనితమై కంఠనాళంలో స్పందించినపుడు 'ఋక్కు' అయింది. ఆ వాక్కే శ్వాసకోశ ప్రాణస్పందన కళలో 'సామగాన'మయింది. అదే వాక్కు ఉచ్చారణ సౌలభ్యం కొరకు స్వర అక్షరబద్ధమై 'ఛందో' రూపం దాల్చింది. ఆ వాక్కు అర్థసౌందర్యం లలిత రసానుభూతి యజ్ఞమై 'యజుస్సు' రూపుదిద్దుకొంది.

**జంధ్యాల వేంకటేశ్వరశాస్త్రి**

ఋక్సామాలు పాదబద్ధాలు. యజుస్సు పాదనియమితంగానూ, నియమరహితంగానూ ఉంది. ఋక్కు - సామం - యజుస్సు ఒక క్రమంలో వచ్చాయి అని ఋషివాక్కు. ఈ మూడు ఒకదానినొకటి కలిసి ప్రణవమై, అవ్యక్తమై, అఖండమై సర్వవ్యాప్తమై నిలిచిపోయాయి. వ్యక్తమగు స్థితిలో యజుస్సు నుండి ఋక్కు ఋక్కునుండి సామం, మరల సామం నుండి యజుస్సు వ్యక్తమగుతూ వచ్చింది. ఈ ఋక్సామయజుస్సుల సంబంధమే త్రయీ విద్య. ఈ విద్యాఫలం 'అ' కార 'ఉ'కార 'మ'కారాల ప్రణవం. ఈ ప్రణవం వలన అఖండకాలం భూత భవిష్యద్వర్తమానా లుగా చేశాడు యజ్ఞపురుషుడు. ప్రథమ పురుష మధ్యమ పురుష ఉత్తమ పురుష విభాగాలుగా జగద్వ్యవహారం సాగుతోంది. ఆ పురుష త్రివర్ణ విభజనే త్రిపద గాయత్రి.

ఈ త్రయి ప్రతిజీవిలో ప్రతిబింబితం. జీవాణువు 'యజుస్సు' గర్భంలో బద్ధమై ఉంటుంది. జీవి జనించగానే సంకల్పం కంఠధ్వనిగా 'ఋక్కు' రూపం దాల్చింది. ఆ ధ్వని శ్వాసనాళాలలో స్పందించి 'సామం'గానం చేస్తుంది. ఆ గానం చైతన్యవంతమై బ్రహ్మాండ బహిరంతర్లోకాల 'ప్రజ్ఞ' వికసించటంతో అహోరాత్రాది కాలమానం జ్ఞాతమవు తుంది. ఇది త్రయీవిద్యావరప్రసాదం. 

# మంచిని స్వీకరించండి! చెడ్డను విసర్జించండి!

"యుక్తియుక్తముపాదేయం
వచనం బాలకాదపి -
విదుషాతు సదా గ్రాహ్యం
వృద్ధాదపి న దుర్వచః"

పెద్దవాళ్ళ మాటవినాలని చెబుతారు. నిజమే. కాని వృద్ధుడైనాసరే. అతడు చెప్పిన మాట చెడ్డదైతే అది మాత్రం వినకూడదు. యుక్తియుక్తమైనమాట, మంచి మాట చిన్న వాడు చెప్పినా దాన్ని తప్పక స్వీకరించాలి. ఇది ధర్మసూక్ష్మం.

'పెద్దల మాట చద్దిమూట' అన్నారు పెద్దలు. ఇది ధర్మం. అయితే 'ధర్మ సూక్ష్మం' కూడా మరొకటి ఉన్నది. అదేమనగా వయోవృద్ధుడైనవాడు ఒకవేళ తన స్వార్ధ స్వప్రయోజనాల కోసం చెడ్డమాట చెబితే అదిమాత్రం వినకూడదు. ఒకవేళ చిన్నవాడు మంచి మాట చెబితే, అతనికేమి తెలుసు? అనుభవంలేనివాడు అని కొట్టివేయ కూడదు. చిన్నవాడు చెప్పినా, పెద్దవాడు చెప్పినా అది 'మంచి మాట' అయితే వయోభేధములను దృష్టిలో పెట్టుకోకుండా విధిగా స్వీకరించాలి ఒకవేళ అది 'చెడ్డమాట' అయితే తిరస్కరించాలి.

ఒక చిన్న ఉదాహరణ. మర్రిచెట్టు ఎంతో పెద్ద వృక్షం. చాలా సంవత్సరాలు బ్రతుకుతుంది. ఎంతోమందికి నీడ నిస్తుంది. అలాగని దాని పండ్లను తింటామా? తినము. గుమ్మడితీగ నేలమీదనే ప్రాకుతుంది. ఎక్కువ కాలం ఉండదు, ఎవరికీ నీడనివ్వదు. కాని ఆ గుమ్మడి పండ్లను మాత్రం ప్రజలు అనేకవిధాలా ఉపయోగించుకుంటారు. ఈ గుమ్మడి పండ్లను ఉత్తరాయణ పుణ్యకాలంలో దానం చేస్తారు. దీనినే 'కూష్మాండ'దానం అంటారు. కాబట్టి మనం యిక్కడ దృష్టిలో పెట్టుకోవలసినది, పైకి కనపడే ఆకారమును కాదు. లోపలవున్న పదార్ధము యొక్క విలువను, పవిత్రతను మాత్రమే.

భరతుడు వయస్సులో చిన్నవాడే అయినప్పటికీ, తన తల్లి కైకేయి చేసిన అన్యాయమును గుర్తించి ధైర్యంగా ఎదిరించలేదా? పసివాడైన ప్రహ్లాదుడు హరిని వ్యతిరేకించిన హిరణ్యాకశిపుడు, సాక్షాత్ తన తండ్రియే అయినప్పటికి అతనిని తిరస్కరించలేదా? ధర్మము తప్పిన రావణాసు రుడు తన అన్న అయినప్పటికి అతనిని విభీషణుడు విడవలేదా? రాక్షస గురువైన శుక్రాచార్యుని మాటను కూడా కాదని వామనునికి మూడడుగులు దానమిచ్చి బలిచక్రవర్తి చరితార్థుడు కాలేదా?

మన ప్రాచీనులు ఆది నుంచి మంచికే అధిక ప్రాధాన్యత యిచ్చారు. కాని వయస్సుకు కాదనే విషయం తేటతెల్లమవుతున్నది. ఇదే వాస్తవమును మన పురాణ ఇతిహాసములు బోధిస్తున్నాయి.

కనుక చిన్నవాడుచెప్పినా, పెద్దవాడు చెప్పినా అందులో వున్న మంచిని స్వీకరించి, చెడ్డను విసర్జించడం మన ధర్మం.

\- సాయిప్రియ

## శ్రీవాణి పోషకులు



Smt. & Sri K.V.V. Satyanarayana
RAMACHANDRAPURAM

## శ్రీవాణి జీవిత సభ్యులు



Sri Turaga Somasundaram
HYDERABAD

రసవద్ఘట్టాలు - 47

# పోస్ట్‌మాస్టర్‌గా పనిచేసిన అబ్రహాం లింకన్

ఒకప్పుడు అమెరికా అధ్యక్షుడుగా పేరుగాంచిన అబ్రహం లింకన్ 1832లో ఇల్లినాయిస్ రాష్ట్ర శాసనసభకు పోటీచేసి ఓడిపోయారు. అప్పుడాయన నిరుద్యోగి. బ్రతుకు తెరువు ఎలా అనుకొంటున్న సమయంలో న్యూసేలమ్ బ్రాంచి పోస్టు ఆఫీసులో ఉద్యోగం ఖాళీగా ఉన్నట్లు పత్రికలో చదివాడు. చాలా తక్కువ జీతం వున్నందున ఆ పనికి ఎవరూ దరఖాస్తు పెట్టుకోలేదు. ఆ ఉద్యోగం లింకన్‌కు దక్కింది. ది. 27-5-1833లో పనిలో చేరారు. అది పార్ట్ టైం ఉద్యోగం ఇతర పనులు చేసేవాడు. భూమి సర్వేపని వివరాలు తెలుసుకొన్నారు. విరామ కాలంలో సర్వేపని చేసుకొని సంపాదించేవారు.

1834లో మరల శాసనసభకు పోటీచేసి గెలుపొందారు. కాని పోస్ట్‌మాస్టర్ పనిమాత్రం వదలుకోలేదు. శాసన సభ్యత్వంతో పాటు ఆ పనీ చేసేవారు. తర్వాత మరో ఉద్యోగం కోర్టుకు సంబంధించింది రావటంతో పోస్ట్‌మాస్టర్ పని మానుకొన్నారు. పోస్ట్‌మాస్టర్‌గా వున్నప్పుడు ఆఫీసు కాగితాలేకాక తన స్వంత జాబులను కూడా పైసా ఖర్చులేక కవర్లపై తన సంతకంతో ఉచితంగా పంపేవీలుండేది. తర్వాత అధ్యక్షుడుగా ఎన్నుకోబడినందున అతని జాబులన్నీ పోస్టల్ ఖర్చులు లేకుండా పంపేవీలుండేది. అబ్రహం లింకన్ హత్యకు గురైన తర్వాత అతని భార్యకు కూడా ఉచిత పోస్టల్ సేవలు కొనసాగేవి.

ఆశ్చర్యకరమైన విషయంఏమంటే లింకన్‌చే పోస్టల్ ఛార్జీలులేని కవర్లను సేకరించటమే. తపాలా బిళ్ళల సేకరణ కర్తలకు మహద్భాగ్యంగా మారింది. 'అలా లింకన్ పంపిన ఒక కవర్ వెల ఈనాడు 3 లక్షల రూపాయలు. 1833-36లో ఇటువంటి కవర్లు ఆరుమాత్రం దొరికాయి. వాటి కెంతో డిమాండ్ ఉండేది.

ఇలా అబ్రహం లింకన్ పోస్ట్‌మాస్టర్‌గా పనిచేసి తపాళ బిళ్ళల సేకరణలో సంచలనం సృష్టించారు. 1959లో లింకన్ 150వ జన్మదినోత్సవ సందర్భంగా వెలువరించిన తపాలా బిళ్ళలకు కూడా ఎంతో విలువ ఉండేది.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

## శ్రీవాణి జీవిత సభ్యులు



Smt. & Sri D.S. SASTRY
HYDERABAD



Dr. K.V.B.S. Sarma
Smt. K.V. Ramanamma
VARAHAPURAM Vizag Dt.



Sri A.V. Dikshitulu
Smt. A.S.S. Vardhani
HYDERABAD

## సంస్మరణ

**శ్రీ తుమ్మలపల్లి సదాశివరావుగారు** ప్రముఖ న్యాయవాది. సుదీర్ఘ కాలం ఆర్.ఎస్.ఎస్. ప్రచారానికి అంకితమైన త్యాగశీలి సహృదయులు. శ్రీవాణికి ప్రోత్సాహమిచ్చి పురోభివృద్ధికి కృషి చేసిన స్నేహశీలి. వారు ది. 20-3-2000 న హైద్రాబాద్‌లో పరమపదించినారు. వారి ఆత్మశాంతికి సాయీశ్వరుని ప్రార్థిస్తున్నాను. వారి కుటుంబానికి సానుభూతి, విచారము తెలియజేస్తున్నాను. -సం

2వ కవర్ పేజి తరువాయి

అవసరం ఎంతైనా ఉన్నది

ఇకపోతే క్లింటన్ ఒకవైపున చంద్రబాబును ప్రశంసిస్తూ ప్రశంగిస్తూనే మధ్య మధ్య కొన్ని చురకలు కూడా వేశారు. టెక్నాలజీని అత్యధికలాభాలకే పరిమితం చేయకుండా, ప్రగతి సాధనకు వినియోగించాలని, వ్యక్తిగత అభివృద్ధితో పాటు సామాజికపురోభివృద్ధిని సాధించడం ఆవశ్యకమని, లక్షలాదిమందికి ఇంటర్నెట్ సౌకర్యం కల్పించామని ఆనందించేముందు, మరెన్నో లక్షలమందికి నీటి సౌకర్యం లేదన్నచేదు నిజాన్ని గుర్తించుకోవాలని కొన్ని హెచ్చరికలు కూడా చేశారు క్లింటన్. అట్టి చురకలు, హెచ్చరికలను పాలకులు సహృదయంతో విశాలభావంతో స్వీకరించినప్పుడే పరిపూర్ణమైన ప్రగతిని సాధించగలుగుతాము.

హైదరాబాద్‌లోని హైటెక్ సిటీలో గడిపిన రెండుగంటలలో క్లింటన్ ఒక నూతన అనుభవాన్ని కూడా రుచిచూచారు ఐ.టి.కి పేదలకు ముడిపెట్టిన నూతన ప్రక్రియను ఆయన ప్రత్యక్షంగా తిలకించి డ్వాక్రా మహిళలతో టెలీ కాన్ఫరెన్స్‌లో మాట్లాడి, వారు స్వయం సహాయక గ్రూపుల క్రింద ఆర్థికంగా వికాసం పొందారని తెలుసుకొని ఆశ్చర్యపడి **అమెరికాలో తాను, తన భార్య హిల్లరీ కలిసి ఎంత కృషి చేసినా ఇంతమందిని సమీకరించలేక పోయామనే వాస్తవాన్ని వ్యక్తం చేశారు.** అక్కడ ప్రదర్శనకు ఏర్పాటు చేసిన స్టాల్స్‌ను తిలకిస్తున్నప్పుడు అక్కడి అధికారులు ఒకక్షణంలో డ్రైవింగ్ లైసెన్స్‌ను తీసి క్లింటన్‌కు యిచ్చినప్పుడు ఆశ్చర్యపడి, ఆ డ్రైవింగ్ లైసెన్స్‌ను జాగ్రత్తగా తన జేబులో దాచుకుంటూ **"వ్యక్తి లాభం, సామాజిక ప్రయోజనం రెండింటిని మేళవించే అపూర్వప్రయోగాన్ని మీరు జరుపుతున్నారు. మేము ఈ విషయంలో నేర్చుకోవలసింది ఎంతో ఉన్నది."** అని క్లింటన్ తన భేషజాన్ని విడనాడి ఒప్పుకుంటూ **"విందును ఏర్పాటు చేసుకోవటం గొప్పకాదు. ఆ విందుని ఎంతమంది ఆరగించారన్నదే ముఖ్యం. అదే విధంగా సమాచార, సాంకేతిక పరిజ్ఞానం సాధిస్తున్న అభివృద్ధి ఫలాలను కూడా అందరూ ఇలాగే కలిసి అనుభవించగలిగినప్పుడే ఐ.టి.కి సార్థకత"** అని క్లింటన్ తన ప్రసంగంలో చెప్పారు అదేవిధంగా హైటెక్ సిటీలో క్లింటన్ ప్రసంగం ఛలోక్తులతో, చురకలతో, హెచ్చరికలతో సరదాగా సాగింది వాటిని సరదాగా తీసుకొని వదలివేయక కార్యరూపంలో పెట్టినప్పుడే చేకూరుతుంది ప్రగతి, వస్తుంది లాభం

ఇకపోతే మన రాష్ట్రపతి, ప్రధాన మంత్రుల ఉపన్యాసాలు కూడా ఎంతో హుందాతనంగా ఉన్నాయి. దేశ గౌరవప్రతిష్ఠలు ఇనుమడింపజేసేవిధంగా ఉన్నాయి. క్లింటన్‌కు ఎక్కడ కోపం వస్తుందోనని, ఏ మాత్రం సంకోచించకుండా మన ప్రభుత్వ ఆలోచనాసరళిని స్పష్టంగా, ధైర్యంగా తమ ప్రసంగాల ద్వారా క్లింటన్‌కు వినిపించారు. భారతదేశము యొక్క ఆత్మగౌరవానికి ఎట్టి భంగం వాటిల్లని విధంగా వ్యవహరించారు వారు అభినందనీయులు.

ఏది ఏమైనప్పటికి క్లింటన్ భారత పర్యటన సత్ఫలితాలనే యిస్తుందనటంలో ఏ మాత్రం అతిశయోక్తిలేదు. భారత్, అమెరికాలు దగ్గరకావడానికి క్లింటన్ పర్యటన కొంతవరకు దోహదం చేయవచ్చును. ఈ సదవకాశాన్ని ఉపయోగించుకోవటంలో ఉన్నది మన విజ్ఞత. కేవలం విమర్శనలకే పరిమితం కాకూడదు. వివేకాన్ని కూడా ప్రదర్శించాలి. అప్పుడే ఆశించిన ఫలితాలను సాధించగలుగుతాం.

## సంస్మరణ

డా॥ కుప్పా వెంకట్రామ శాస్త్రిగారు ది. 16-3-2000న నిర్యాణం పొందారు. వారు ప్రముఖ వైద్యులు. స్వాతంత్ర్య సమరయోధులు, ప్రఖ్యాత సంఘ సేవకులు, మానవత్వం మూర్తీభవించిన మహనీయులు. గత 50 సంవత్సరాలుగా బీదలకు, పేదలకు ఉచితంగా వైద్య సేవలందించిన మహాత్యాగి. శ్రీవాణిని ప్రోత్సహించిన ప్రముఖ జర్నలిస్టు. వారు లేనిలోటు తీర్చలేనిది. ఒక్క బందరు పట్టణమేగాక యావత్ కృష్ణా జిల్లాయే ఒక ప్రముఖ వైద్యుని కోల్పోయింది. కమ్యూనిజం నుంచి ఆధ్యాత్మికమునకు పయనించిన మానవతావాది. వారి ఆత్మకు శాంతికలగాలని సాయీశ్వరుని ప్రార్థిస్తున్నాను. వారి కుటుంబానికి సానుభూతి, సంతాపం తెలియజేయుచున్నాను.

- సం॥

Postal Registered
No.H/M.P.M./34, Dt. 10-12-1984

SREEVANI
APRIL 2000

Regd. with Registrar of News
Papers Regd. No. 45039/85



EDITED, PRINTED AND PUBLISHED BY **SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO**

*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001. Ph: 21137*